# సమాలోచన



జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 4 [illegible] 1-4-1981

## * ఈ సంచికలో *



16—4—81 సంచికలో పురాణములు - భక్తి, చిత్రభారతమునాటి సంఘ స్థితిగతులు, శివశంకరశాస్త్రి వ్యక్తిత్వము, కుమారసంభవము - తపోవన ఋతువర్ణనములు మొదలగునవి ఉంటాయి

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—

చందా
సంవత్సరమునకు రు. 12—00
అర్ధసంవత్సరమునకు రు. 6—50.

విడిప్రతి 60

★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V T J College, Rajahmundry.

సంపుటము 4 రాజమహేంద్రవరము 1-4-1981 సంచిక 11

# వేదులవారి దీపావళి

- శ్రీ శిష్టి శ్రీనివాసరావు, బి. ఓ. ఎల్

జీవన స్రవంతి వలెనే కవితావాహిని ఒకేరీతిగా ప్రవహిస్తూ ఉన్నా కొంత పాతనీరు పోవడం, క్రొత్తనీరు రావడం జరుగుతూ ఉంటుంది. కాని ఎన్ని మార్పులు చేర్పులు జరుగుతూ ఉన్నా కవితా సామాన్య ధర్మాలు నాటి నాటి కవితల్లో అనుస్యూతములై ఉండటం వలననే కవిత్వం అజరామరమై, వింత వింత సోయగాలతో రసహృదయులను అలరిస్తూ ఉంటుంది. ఇది కవిత్వ సామాన్య ధర్మం.

'పరిసర జీవన ప్రభావ ప్రభావితమైన హృదయం ఒక్కొక్క లక్ష్యంతో ఒక్కొక్క దారిని తన ప్రగతిని కొనసాగించుకుంటుంది. ఇదే సామాన్య ధర్మంతో భావకవిత్వం ఉద్భవించింది. 'మామిడి కొమ్మమీద కల మంత్ర పరాయణుడైన కోకిల స్వామికి మ్రొక్కు'టంతో భావకవితకు నాందీ ప్రస్తావన జరిగింది. పాశ్చాత్య నాగరకతా సంస్కృతి సంపర్కంగా మన ప్రాచీన భారతీయ సంస్కృతి యందు కొన్ని మార్పులు కలిగినవి. అటువంటి మార్పులు సాహిత్య పరంగా కూడ జరిగినవి ఈ మార్పులే భావ కవితకు అంతర్లీనంగా ఏక సూత్రతను చేకూర్చాయి. కాబట్టి నాటి ప్రబంధ శృంగారము 'ప్రబంధా'లలో భౌతిక సుఖాన్ని అంతిమఫలముగ ఆకాంక్షిస్తే, ఈ భావ కవితా శృంగార సరసిజం అమలిన శృంగార సిద్ధాంతానికి అంకితమై హృదయగతమైన ప్రేమ భావాన్ని, అంతర్గతంగానే అనుభవించి, ప్రేమ తపస్సు చేసి ఆత్మానంద బ్రహ్మ పదాన్ని చేరింది ఈ భావకవిత్వాన్ని ఆత్మాశ్రయ కవిత్వముగ పేర్కొన వచ్చును అనుభూతి కవిత్వము కూడ ఇందులోనుండి పుట్టుకొచ్చిన శాఖయే. భావ కవిత్వాన్ని కొందరు 'అభావ' కవిత్వంగ, 'బావ' కవిత్వంగ విమర్శించినప్పటికిని ఆ విమర్శ వారివారి సంకుచిత మనస్తత్వాన్ని సూచించిందే కాని భావ కవితా భామ తేజమున కడ్డు నిల్వలేక పోయినది.

ఇటువంటి భావ కవిత్వ సారస్వత నందనోద్యానమున విరిసిన సుమశాఖియే వేదుల వారి 'దీపావళి'. ఈ ఖండ కావ్య రచయిత వేదుల సత్యనారాయణశాస్త్రి గారు ఈ 'గౌతమీకోకిలము' తెలుగు తోటకు నవవసంతోదయమైన తోడనే వన్నె కెక్కిన పుంస్కోకిలములతో గానము చేసిన దీ ఖండకావ్యమును. 'వారికవిత ఎంతనవ్యమో యంత గంభీరము, ఎంత ఆలంకారికమో, యంత అనవద్యము మసృణ మకరంద మాధుర్యము వంటి వారి మంజుల కావ్యరసము నా పరవశులు కాని మధుకర కుమార లుండరు;అని దివాకర్లవారు వీరికవిత్వము నెడల చేసిన ప్రశంస ఎంతయు సార్థకమైనట్టిది.

భావ కవులకు సామాన్యముగ ప్రకృతి పూజనీయ ఆయమ సృష్టించిన సకల 'సహజవస్తు సంపద వారికి ఆదరణీయము. వారు ప్రకృతిని స్త్రీమూర్తిగ తలంతురు. వేదులవారి దృష్టిలో స్త్రీ ప్రేమము దేవత. వారిమాటల్లోనే చెప్పాలంటే 'ఆమె నవనీతహృదయ, నా యంతరంగ శాంతిదేవత, ప్రేమజీవన విధాత, కైశిక గీతి .. నాజన్మజన్మ పుణ్యములు పండి ప్రాప్తమైన పద్మాసీన భాగ్యలక్ష్మి, ఆమె పద సన్నిధాన దివ్య స్థలాన భక్తినమ్రడనై నిలంబడిన యపుడు, తలంపునక వచ్చు నా పేదతనము నాకు' అని తన సౌమ్యగుణమును భక్తిభావ పురస్సరముగ వెల్లడించినాడు.

భావ కవితకు ప్రాణం కేవలం ప్రియురాలియెడల మోహం కాదు. ప్రకృతిలో ఏకమయి పోవాలనే వ్యామోహం. కనుకనే వేదులవారు ఇలా అంటున్నారు

'మ్రొక్కిన కొలంది గాలితో(

ద్రొక్కివేయు

నీ కఠిన లోకమెల్ల బహిష్కృతమ్ము

రెండు చిమ్మటలార, ఈ రాత్రివేళ
నావలెనె పాడుకొనుమీ రేనాటి సుఖులం'

మద, మోహ, మాత్సర్య, కుటిలత్వ బుద్ధులు కలిగిన ఈ మానవ ప్రకృతి కంటె వారికి పరోపకారార్థమై విలసిల్లు సహజ ప్రకృతి ప్రియమైనట్టిది. కవి తనతో డుగ 'చిమ్మట' అను ఆహ్వానించటం ఈ 'దీపావళి' ఖండ కావ్యము లోని ప్రత్యేకత.

ఈ దీపావళి ఖండకావ్యము కాంతులీను చైతన్య దీపిక, నవతను కోరుతున్న ప్రబోధకవితా వాళిక. కనుకనే ఈయన 'కాగడా' కవిత, అచేతనావస్థలో ఉండే స్తబ్ధుల్ని కూడ కదిలించి సకల మానవుల గుండెలోతుల్లో చైతన్య దీపికలు వెలిగిస్తుంది.

'తొడిమ వీడినపూవు త్రోవచూడదు తీవ
గాలి కలిసిన పాటకై పక్షి వెతపడదు'

అని అనటంలో ఎంత భావుకత ఉందో, 'తరగ విరిగిన మహోదధి తీసి పోవదు, అనటంలో అంత చైతన్యం ఉంది.

'పశ్చిమాశా మేఘ పటలాంచలముల
మది ప్రొద్దు రేపటి యుదయమ్ము కొరకు
దాచుకున్న ప్రతాప రోచిర్ల హారులను
వెలిగించు కాగడా వెలిగించవోయి

అని భావితరంపై ఆయనకున్న ఆశను వేయి వెలుగు కాంతులతో వ్యక్తం చేసినాడు

అపారమైన దేశభక్తి, అప్రతిహతమైన జాత్యభిమానము ఈయన 'కాంతు'లో వ్యక్తీకరించారు స్వాతంత్ర్యోద్యమ కాలంనాటి స్వాతంత్ర్యేచ్ఛ ఈయన కవితల్లో కూడ పెల్లుబికినది జాతి యావత్తు నీచపుదాస్య వృత్తిలో మ్రగ్గుచుండగ ఈయన గుండె కరిగి నీరై పారింది ఆర్ద్రమైన ఆకంఠం ఇలా పాడింది.

'నీచపు దాస్య వృత్తి మన
నేరని భారత మాతృదేశ సే
వా చరణమ్ము నందసువు
లర్పణం జేసిన వారి పార్థివ
శ్రీ చెలువారు చోటం, దద
సృగ్రుచులన్ వికసించి, వానల్
వీచుచు, రాలిపోవగ వ
లెం దదుదాత్త సమాధి వృత్తికన్'

ప్రేమపావిత్ర్యం, నిర్మమత్వ నిర్మోహ శీలిత్వంతో తృప్తి పడక ప్రేమ భంగం పెను వెత కాగా ఆక్రోశించే ఆనాటి సాంఘిక వ్యవస్థలోని ఏర్పాటులతో నలిగిన ఈ 'గౌతమీకోకిల' గుండె

'నేను మిగిలితి నీగౌతమీనదీ ప
విత్ర గర్భంబులో మ్రోత వెట్టుచున్న
యుగయుగాంతర విశ్వమహోగ్ర దుఃఖ
జీవగీతాల కావృత్తి చెప్పుకొనగ'
అని నిట్టూర్చి విలపించినది.

నాడు మన తెలుగు సాహిత్యంపై బెంగాల్ సాహిత్య ప్రభావం మన తెలుగు భావకవులపై తనముద్రను కనపరిచినది. వేదుల వారి విషయంలో కూడ

'దగ్ధ దినైక చితా భస్మరాశి
సుప్తి వీడెడి యుషస్సునకు పునాది'
'మాలికగ్రుచ్చ నెంచు ప్రేమాలను
లీవనిక్ జొర నసర్పాలు.'

వంటివానిలో రవీంద్రుని భావ చిత్ర ధ్వనులు బాహాటంగ ప్రవేశించినవి. ప్రేమ

ఈ భావ కవిత్వశాఖలో కవే నాయకుడౌతాడు. కవే భావుకుడౌతాడు. తన కంటూ ఒక ప్రేయసిని సృష్టించుకుంటాడు ఆమెకు ప్రకృతికి అభేదం కల్పిస్తాడు ప్రకృతిలో లేని రామణీయకతను ఆమెలో చూస్తాడు ఆమెలోని సౌందర్యాన్ని ప్రకృతితో పోలుస్తాడు ఎందుకంటే ప్రకృతి నిష్కల్మషమైనది నిత్యనూతనమైనది. వేదుల వారు ప్రేమకిచ్చిన నిర్వచనం

'ప్రబల తాప విదీర్ణమై బాష్పవారి
పదను వారిన యెద ప్రేమ పాదుకొనును
కట్టునం జేర్చి బోద నీర్గట్టకున్న
నారెటుల నాటుకొనును కేదారమందు.'

ఒకరికై ఒకరు తపించి కన్నీటి వలపు ధారలు కురిసినగాని ప్రేమ మొక్కలు బాగుగ పాదుకొని ఏపుగ పెరిగి పుష్పఫల సంభరితములు కావు. కర్షకులు ధాన్యము పండించుకొనునపుడు చేయు కృత్య మట్టిదేకద. కాకున్న ధాన్యము పండించుకొనుట భౌతిక జీవనము కొరకు. వలపుపంట పండించుకొనుట మానసికానంద బ్రహ్మపదము చేరుట కొరకు. 'తొలివేగుబోక రాలు పూలజతపోలె నీవలపు సుధాపూరమందు' తేలిపోవలెనన్న అట్టి ఆనంద మవసరమే.

ప్రేయసీ ప్రేమికులు చేరువై ఐక్యమయిననాడు ప్రేమ దేవత కది పవలగును. అట్లుగాక వియోగబాధలో వెతలంపడిన అదియే ప్రేమ దేవతకు రాత్రి యగును. కనుకనె 'మన వియోగైక్యములనెయెదవు ప్రేమ దేవతకు రేయుంబవళ్ళు' అని ప్రేమదేవతకు చీకటి వెలుగులను కాసింపగల భావుకులు భావకవులు.

దేవులపల్లి వారివలెనే ఈయన కూడ స్వేచ్ఛాగాన మొనరించినాడు. కాని ఈయన స్వేచ్ఛాగానము విరహ వేదనలో నుండి 'కన్నీటిపాటలలో' నుండి పుట్టుకొచ్చినది 'బ్రతుకు దుఃఖమ్ము, ఆశపడుటె దుఃఖమ్ము' కనుకనే

'కాలిసంకెళ్ళతో గానము నేర్పు
పైడిపంజరముపై భ్రమ లేలనాకు
దోగముబ్బుల వెన్క దోబూచులాడు
చుక్కల వెలుగుతో సాటయేలనాకు
ఈనదు కానలో ఏకాంతముగను
చెట్లచేమల తోడ సెలయేళ్ళతోడ
పూలగుత్తులతోడ బులుగుల తోడ
పాటలాడుచుం బాట లాలపించుచును
స్వేచ్ఛగా గాలిపై విహరించుచుందు'

అని ఆయన ప్రేయసి యనుచున్నది. వేదులవారు ఆషాఢ మేఘముయొక్క

కర్తవ్యమును పరిపూర్ణరీతిగ ఉత్ప్రేక్షించుచున్నారు.

'ఏ విరహార్తుడేని హృద
యేశ్వరి సన్నిధి కేగ జాలు వా
ర్తావహు గోరి, యేగిరిని
తంబ తటమ్మునేని చిక్కి, వా
పోవుచు నుండె నేమొ యని
పొంచి దెసల్ పరికించి చూచుచు
న్నావ ప్రవాస దుఃఖిత మ
నః శ్రవణోత్సవమా, పయోదమా!'

విరహార్తులు హృదయేశ్వరి కొఱకయి గిరిసితంబ తటమ్మున నిల్చి చిక్కిపోయి, వాపోవుచున్నచో వారికి ఆ ఆషాఢ మేఘము ప్రవాస దుఃఖిత మనః శ్రవణోత్సవము. చైత్ర శుభ ప్రభాత వంశికల గాన మాధురి శేవన మందికే నేదోకో యని తలపించు వారలకు ఆషాఢమేఘ మెంక ఆశాసౌధము.

ఈయన ప్రణయమూర్తికడనె శుక పికములు మౌన గాన ప్రవృత్తి నేర్చినవి. కాకున్న మాలి తోపులపై నివసించు వాని గొంతుక మధుప్రవాస ప్రయాణ వేళ వీడుకోలుపు పాడ ఏల గొంతు పెగలలేదు?

'ప్రణయ తంత్రుల విశ్వవిపంచి నేను
శైలహృదయమ్ములోని నిర్ఝరము నేను
వసుమతీ గర్భతల సరస్వతిని నేను
సాగరమ్మె వియోగ సంయోగ మురళి'

అని పలికిన ఈయన ప్రణయమూర్తి ప్రణయాకాశంలో వెలిగిన దివ్యజ్యోతి.

భావకవిత్వాన్ని నిర్వచించి చెప్పటం చాలాకష్టం. ఎవరికివారు చదువుకొని స్వాయత్తం చేసుకొని ఆత్మగత మొనర్చుకొంటే ఆ ఆనందము అనిర్వచనీయము. ఆధునికాంధ్ర కవిత్వములో అనర్ఘమణి ఈ దీపావళి ఖండకావ్యము వేదులవారిలో ప్రాచీనుల కవితా స్పర్శ కొంత కలదు. కావున కవి సమయములను విడువలేదు. ఈయన కవిత్వ భాషకు ప్రాచీనుల పటిమ యున్నది. జీవితసాగర మథనమునందు పెల్లుబికిన దగుటచే వీరి కవిత్వము పారిజాత కుసుమ సౌరభము, అమృతమయమైన అమరత్వము, నిండుజీవన స్పర్శ అనువానితో అలరారినది. ప్రతికవితాఖండిక ఒక రసవత్కావ్యము వెలుగునీడల జీవనవేణువూది పాడుకొనగల ప్రభాతగీతు లెన్నో ఇందు కలవు

'వలపు తీపి రుచించగని వట్టిచాతి
గుండెలోకమ్ము నిపుడు గుఱియనిమ్ము
హృదయమున్నంతవరకు నా ప్రేమకాంక్ష
బ్రతికి యున్నంతవర కేడ్చి
బ్రదుకుచుందు.'

— —

ఆధునిక నాటకరంగము

# వేదమువారి యౌగంధరాయణుడు

- శ్రీమతి కొలచలమ శారద.

నాట్యోత్పత్తి లేక నాటకోత్పత్తి -

భారతీయ నాటక కళా విషయమున ప్రథమముగా పేర్కొనదగిన ప్రామాణిక గ్రంథము భరతముని ప్రణీత మగు నాట్యశాస్త్రము నాట్య ఆద్యాచార్యుడగు భరతముని దృష్టిలో నాట్యమనగా ప్రదర్శింపబడుచున్న నాటకము. ఋగ్వేదమున గాత్రవిక్షేపమాత్రముగా నున్న నాట్యము క్రమముగా రూపారోపణము నొంది నాటకముగా పరిణమించినది. నాటక ప్రక్రియకు దివ్యయోనిత్వమా పాదించుచూ భూలోకమున అది ప్రవర్తిల్లిన విధానము నిట్లు తన నాట్య శాస్త్రమున భరతముని విపులీకరించెను.

అధర్మప్రవర్తకు లగు మానవులను స్వధర్మనిరతుల నొనర్చుటకై దృశ్యము, శ్రవ్యమునగు క్రీడనీయకము నొకదానిని సృజింపు మని దేవతలు బ్రహ్మదేవుని ప్రార్థింపగా నాతడు పంచమ వేద మన బడు నాట్యశాస్త్రమును కల్పించి తదభినయార్థమై మంజు, కేశి మున్నగు అప్సరసలను, గానమునకై నారద తుంబురాదులను; సృష్టించి భరతమునికి నాట్యవేద ప్రయోగము నుపదేశించెను. భరతముని కుశలులు, విదగ్ధులు నగు తన నూరుగురు శిష్యులకు ప్రయోగవిధానము నేర్పెను. నాట్యవేద మత్తులగు భరత శిష్యులు ఋషులను, మునులను, బాధించుచుండగా వారిని భూలోకము జన్మింపుడని మునులు శపించిరి. భూలోకమున జన్మించిన భరత శిష్యులు అనేక నూతన నాట్య ప్రయోగముల నెరపుచు అచటి స్త్రీలయందు సంబంధము కల్పించుకొని సంతానవంతులైరి. ఈ విధముగా బ్రహ్మకల్పితమై భరతముని వలన వ్యాప్తిలోనికి తేబడిన నాట్యము-లేక నాటకము భూలోకమున అవతరించినది.

—

నాటక ప్రక్రియకు దివ్యయోనిత్వ మంగీకరింపనివారు ఆదిమమానవుని ఆట పాటలు, అంగవిన్యాసములే నాట్యారంభ సూచకములని భావింతురు. ప్రపంచ చరిత్రలో ప్రాచీనమగు గ్రీకు నాటకోత్పత్తిని గురించి PRFPY మౌల్టన్ ఉద్ఘాటించుచు, తొలి మానవుని ఆట పాటల నుండియే సర్వకళలును ఉత్పన్నము లయ్యె నని తెలిపినను సర్వదేశ కళలకు ఆ అభిప్రాయము వర్తించునని చెప్పుట అసమంజస మగును.

నాటకవికాసము -

నట్, నృత్, పదములు ఋగ్వేదమున కలవు క్రీ॥పూ॥ రెండవశతాబ్దివా డగు

పతంజలి వ్యంజనములు నట భార్యలవంటి వని తెలుపుటచే ఆనాటికే నటులు కుటుంబములతో నాటకములాడు చుండెడివారని స్త్రీలు నాటకముల పాల్గొను చుండెడివారని తెలియుచున్నది.

కాళిదాసు నాట్యమును చాక్షుష క్రతువుగా పేర్కొని మాళవిక చలితమనెడి నాట్యమును ప్రదర్శించె నని తెలిపెను. 4 వ శతాబ్దివాడగు అమరసింహుడు నాట్యము, లాస్యము, నృత్తము మున్నగు నవి సమానార్థకములుగా పేర్కొనగా, 10 వ. శతాబ్ది వాడగు అమరసింహుడును దానినే బలపరచెను తెలుగున నాటకారంభము ఎప్పుడెట్లు జరిగెనో తెల్పుటకు తగిన సాక్ష్యాధారములు లేవు. 12 వ శతాబ్ది వాడగు సోమనాథుడు తెలుగు నాటకములు సాంగ భాషాంగ క్రియాంగములుగా ప్రయుక్తము లగుచున్న వని తెలిపెను. భాషాంగ క్రియాంగము లనగా చేయు చేతలు ఆటలు; అనగా వాచిక ఆంగిక అభినయము అని అర్థము వచ్చుట వలన 12 వ శతాబ్దికే అట్టి ప్రదర్శనలు కలవని తెలియుచున్నది

12 వ శతాబ్దం తరువాత తెలుగునాటకమును శిష్టులు, రాజులు, ఆదరింపక, కేవలసంస్కృత రూపక రచనకే, ప్రాధాన్య మిచ్చుట చేత, తెలుగునాటకరంగము బహిరంగ స్థలముల ప్రదర్శింపవలసిన అగత్యమేర్పడెను.

17 వ శతాబ్దమున- నాయకరాజుల కాలమున ఆటపాటలనుండి వచ్చిన నాటకము, గేయ ప్రధానమగు యక్షగానము రెండును సమీకరణ మొందెను ఆనాటి సాంఘిక ఆచార వ్యవహారములు, వ్యక్తుల లోని లోప ప్రకటనము ప్రధానోద్దేశములుగా నుండెడివి

1880 లో ఆధునిక రంగస్థల నాటకములకు పునాది వేసినవారు ధార్వాడ నాటక కంపెనీ వారు. వీరు ఒకే ప్రదర్శనను 5 లేక, 6 రాత్రులు నిర్వహించెడివారు. 1886 లో శ్రీ కోరాడ రామచంద్ర శాస్త్రిగారు రచించిన మంజరీ మధుకరీయము తొలితెలుగు స్వతంత్ర నాటకము - పిమ్మట కొక్కొండవారు, తొలి సాంఘిక నాటక కర్తలగు (నందక రాజ్యము) వావిలాలవారు తెలుగుసారస్వతములోని ప్రతిప్రక్రియలోనూ, ప్రథమ స్థానమునో, ప్రధానస్థానమునో అలంకరించిన వీరేశలింగముగారు, మున్నగు వారు, ఆధునిక నాటకప్రదర్శనల కనేక హంగుపొంగు లమరించిరి.

19 వ శతాబ్దములో ధర్మవరం కృష్ణమాచార్యులుగారు సరసవినోదినీ సభను స్థాపించి ఆంధ్ర సంస్కృత ఆంగ్లాది నాటకములను ప్రదర్శించి బహుజనాదరణ పాత్రులైరి యుగకర్తలుగా పేర్కొనదగిన చిలకమర్తి వారి తర్వాత పేర్కొనదగిన వారు శ్రీ వేదము వేంకట రాయ శాస్త్రిగారు వీరు మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ బిరుదాంచితులు వీరు మూడు స్వతంత్రనాటకములు ఏడు సంస్కృతానువాదములు రచించినను. వీరి కెనలేని ఖ్యాతిని గూర్చినది - తొలి స్వతంత్రరూపక మగు ప్రతాపరుద్రీయ నాటకము.

ప్రతాపరుద్రీయము- వేదము వారి యుగంధరుడు.

ముస్లిములు,రజకులు మున్నగు పామరుల స్వరూప స్వభావాదులను, వాచికమును ప్రత్యేకముగా పరిశీలించు స్వభావము గల శ్రీ శాస్త్రిగారు తమ ప్రతాపరుద్రీయమున, పాత్రోచితభాష ప్రవేశపెట్టిన ప్రప్రథములు. కాళిదాసాదుల నాటకములు విశ్వవిఖ్యాతి నొంది పాశ్చాత్యుల ప్రశంసలను సైతమందిన మనకు సుపరిచితములైనను,ఆంధ్ర భాషలో కట్టుదిట్టమగు కథా సంవిధానము - నాటక రచన జరిగినదీ 18 వ శతాబ్దంలోనే యని చెప్పనగును.18వ శతాబ్దిలో ఉత్తరోత్తర కాలముల మార్గదర్శకములగు రచనలచే సాహితీప్రియుల నొక ఊపు ఊపిన రచనలొనర్చినవారిలో వేదము వారొకరు. శ్రీ శాస్త్రిగారి విద్యాభ్యాసము ఉద్యోగ నిర్వహణ మంతియు ఆంధ్రదేశమునందే జరిగినది. శాస్త్రిగారు రాజమహేంద్రవరమున ఉన్నప్పుడు వాఙ్మయ రంగమున ప్రవేశించిరి. నాగానంద, శాకుంతల, సరిత్సాగరాదు లనువాదాంధ్ర నాటకములు శారదాకాంచికలను వీరి విమర్శగ్రంథములు సప్రమాణములు. మొదటి నుండియు వేదము వారు నూతన మార్గావలంబకులు, తత్ ప్రయత్నాన్వేషకులునై యుండిరి నూతన మార్గముతో కవిత వ్రాయవలెనని వీరు తమ నాగానంద నాటకమున పాత్రోచిత భాష ప్రవేశపెట్టిరి ఇది కిట్టని కొందరు నిరసించినను పాత్రోచిత భాషావశ్యకతను గురించి శాస్త్రిగారి సహేతుకములు యుక్తియుక్తములునగు ఉపన్యాసములను గాంచి పండితలోకము వీరి నాదరించినది.

శాస్త్రిగారి సాహిత్యపిపాస, స్వతంత్రతావిషయనిరూపణ శక్తి వీరిస్వతంత్ర నాటకములలో స్ఫురించును వీరి రచనలు శతాధికములుగానున్ననూ, ఎనలేని కీర్తి నందించిన ఘనత ప్రతాపరుద్రీయమునకే దక్కను వీరు బాల్యమున తండ్రిగారి వాచకమున కథగా విన్నదాని నాధారముగా గొని రసవత్కల్పన లనేకము లొనర్చి, తమ నాటకము నొక ప్రమాణ స్థాయిలో రచించిరి. రాజును యుద్ధమున గెలువలేమని ఒంటరిగా అడవిలో నిద్రించు సమయమున బందీచేయుట చెకుముకి గడుసుదనము, పేరిగాని హాస్య ప్రవర్తన, యుగంధరుడు చెకుము

భేతాళరాయని సాయముతో వాణిజ్యము నెపమున ఓడలో బంధించి ఓరుగల్లునకు గొనివచ్చుట, మొదలగు ముఖ్యసంఘటనములన్నియూ, శాస్త్రిగారు నేర్పుతో కల్పించిరి. ఇది మొట్టమొదటి జాతీయ స్వతంత్రనాటకము. ఇట్టి ఈ నాటకములో ఆద్యంతముల ననస్యూతముగా సంచరించుచు, నాటకమునకు జీవత్వ మొండించి చిరంజీవి అయినపాత్ర యుగంధరుడు. తెలుగు సాహిత్యములో చిరస్థాయిగా నిలచిపోయిన సచివోత్తములు కొందరు కలరు. కృష్ణరాయలకు తిమ్మరుసు, చంద్రగుప్తునకు చాణక్యుడు వీరందరొక కోవలోని వారు. వీరు ప్రభువులకు బహిః ప్రాణములవలె సంచరించుచు, దైవికమగు దుస్సంఘటనలో రాజు చిక్కినపుడు, మానావమానములను, ప్రాణములను లెక్కచేయక, ప్రభురక్షణకై తమ జీవితములను పణముగా పెట్టి శక్తియుక్తులతో వారిని ఆపదలనుండి తప్పించిన ఉదంతములు కోకొల్లలు. ప్రస్తుతము వేదమువారి రచనాశిల్పము యుగంధరుని తీర్చిదిద్దిన విధము పరిశీలనాంశము

(సశేషము)



## వంగల పార్థసారధి అయ్యంగారి "యశోధర"

– శ్రీ చింతలపూడి వెంకటేశ్వర్లు, ఎం. ఏ.

సత్త్వప్రధానంబులగు వైదిక విధినిర్వహణంబుల యదార్థంబు మరచిన పండితబ్రువులు స్వార్థంబున మూర్ఖత్వంబు మేళవించి హింసాకాండయందు లోకంబును భయవిహ్వలంబు గావించి తిమిరంబున సర్వంబును ముంచు సమయంబున రజోగుణంబునం దుద్భవించియును తద్వ్యతిరిక్తంబగు నహింసను బోధించి సత్త్వంబు నుద్ధరించిన గౌతమబుద్ధుని కథల నీ దేశంబున నెందరో కవు లెన్నియో విధంబుల వెలయించిరి. లోకంబున పురుషుం డొనరించు మహత్కార్యంబు ప్రతిదానికిని ప్రత్యక్షంబుగనో లేక పరోక్షంబుగనో ఒక స్త్రీ హస్తం బుండుట యనివార్యంబు. అప్పురుషుం డుద్వాహితుం డయ్యెనేని యువ్వనిత యాతని యర్ధాంగి యగుటయును పెక్కు సందర్భంబుల సాధారణంబు. అట్టియెడ బౌద్ధం బను పేర విశ్వవిఖ్యాతంబైన యొక సాత్త్విక మతంబునకు మూలపురుషుండైన సిద్ధార్థుని ప్రసిద్ధి కాతని యర్ధాంగి యశోధం సహకారంబు పరోక్షంబుగనైన నుండి యుండు ననుట నిర్వివాదంబు. అట్టి యశోధ సతి విషయంబున దృష్టిసారించిన కవీంద్రులయందు తెలుంగున శ్రీమాన్ వంగల పార్థసారధి అయ్యంగార్ ఒకరు. నిరాడంబరులగుట నప్రసిద్ధులగు వారి యశోధర హృదయం బను కావ్యంబున యశోధరను గూర్చి కొంత వివరింప ప్రయత్నింతును

వంగలవారి యశోధర కడుంగడు ముగ్ధ పరమ పాతివ్రతరాలు. తన్నెడబాటుకం గురిచేసి వనంబుల జన్నపతిని పల్లెత్తుమాట మనంబున సైతము దలంపని స్వాధీనచిత్తంబు ననుసరించిన పరమపతివ్రత సిద్ధార్థుంకును నామె హృదయంబు నెఱింగిన పరమపూరుషుండు. అతండు తన్నరణ్యంబున దిగవిడచి చనమన్న చెన్నుడితో తనమాటలుగా యశోధరకు వినిపింపుమని చెప్పినపు డీ విధంబున దన యర్ధాంగిని సంభావించును.

ఈ విశ్లేషపు ప్రకృతిని
నీవొక్క అపూర్వశాంతి నిశ్చలభావ
ప్రావిర్భావము గాంతువు
గావుత! కారుణ్యకల్యకాంతులు విరియన్.

భర్తృవియోగంబున విపరీతస్థితి నొందుట స్త్రీ సహజం బగు ధర్మము. యశోధర సహజంబగు శాంత ప్రకృతి. అది యపూర్వంబు కాదలయు నని సిద్ధార్థుని భావనము.

అసూయారహితం బగు యశోధర హృదయౌన్నత్యంబు చెన్నుని వచనంబుల సుప్రకటితంబు

'అది అస్పృశ్యతరాట్స్వముక్త మధుర
వ్యాహార మాదేవి! నీ
హృదియేకాదు సమస్తలోకహృదయం
బీనాటి విశ్లేషత
త్రపదశన్ విన్నదనమ్ము వొందినదికే
తల్లీ! పునర్దర్శనా
భ్యుదయోత్సాహ మహోత్సవక్షణముకే
ఊహించి జీవించెదన్'

'ఆత్మవత్సర్వభూతాని' యను వేదోక్తి యశోధరయందు సార్థకంబు లేకయున్న భర్తృవియోగంబున తనకుందు నెల్లవారి బాధకు సమంబు జేయునెడ నామె యా చెన్నుని సహింపగల్గునా ?

వినెనో లేదో యశోధరాసతియు ని
ర్వాణస్థితిన్ నిల్చెపో

యినదట్లే! సఖులెల్ల రొక్కడిగా
  నెంతేని చేపట్టి పి
ల్చినను బల్కదు, భర్తృమార్గగతదృ
  ష్టిం ద్రిప్ప దింకేమనన్!'

యశోధరకు భర్తతో గల బంధం బిట్టిది. అట్టి నిశ్చలస్థితిలో ఆమె వహించిన మౌనముద్రపై కవీంద్రులు వ్యక్తపరచిన సంశయంబున నామె యాత్మశక్తి ప్రస్ఫుటం బగును.

ఈ మౌన మెట్టిక అగ్నిపర్వతము త
  ల్లీ! బ్రద్దలైనన్ వియ
ద్వ్యాముల్ వహ్నిశిఖాసహస్రముల యుం
  గున్ భస్మమైపోవునో!
భూమమ్మే చెలరేగునో? సకల వే
  ధోండమ్ము భ్రమంగన్ తమో
వ్యామిశ్ర ప్రళయార్భటుల్ బ్రతుకు స
  ర్వస్వమ్ము ధ్వంసించునో?'

శోకంబు తమంబునుండి సత్త్వంబునకు జాగృతంబగు నెడ నాసమయంబును కవి వర్ణించిన తీరు కడు ప్రశంసనీయంబు

పంచెన్ శ్రేణులుకట్టి పక్షివితతుల్
  ప్రాగ్దిక్సముద్యత్ప్రభా
కర రాగాత్మకయోగ సమ్మిళిత మే
  ఘద్వారబంధంపు బం
గరపుంబూతలపై ప్రబుద్ధ జగతీ
  కల్యాణహేవాకసుం
దరమౌ తోరణకట్టి, ఆశల వినూ
  త్న స్నిగ్ధతల్ నిండగన్.'

విపరీత పరిస్థితిలో మానవునకు కావలసినది ఓరిమి, సమాలోచనము. యశోధరలోనున్న సహనపరాకాష్ఠకు కవివర్యులు ముగ్ధులై

'ఒక మనోమహాబ్ధి నుల్లోల కల్లోల
మాలు సహస్రములుగ పొంగువేళ
మేర మీరనట్టి ఓరిమిగల్గు స
మ్మాన్యులందు ప్రథమ గణ్య వీవు!'

అని సంభావించిరి. ఆమె మౌనముద్రకు అవధిని సహితము చక్కగా వ్యక్తీకరించిరి.

'అది వియోగ సంయమన మహాసమాధి!
ఆమె స్థాణువైనది సుదీర్ఘాబ్దమునకు
చలనమందని బ్రతుకు కావల రహస్సు
తామృత సరోజములు విచ్చునంతవరకు!'

అది వియోగ సంయమన సమాధి. అందు స్థాణువైన యశోధర. దైహిక స్పృహను గోల్పోయిన ఆమె హృదయము తన నాథు నిట్లు భావించుచున్నది.

'నీది శరత్ప్రసన్నమగు
  నిర్మల రూపము, నీ స్థిరాను కం
పోదయ కాంతు లల్లుకొని
  యున్నవి మాదృశమానసమ్ములో
ఏదిశ చూచినన్ ప్రతిఫ
  లింతువు హారి విచారశీలివై
నీది శరత్ప్రశస్త మగు
  నిర్మలవర్తనమో హృదీశ్వరా!'

'నీకమనీయ హాసముల
  నిల్వున జెల్వగు పువ్వుటీరముల్
నాకను గల్వవిప్పులకు
  నవ్విన యిర్వనిలో తటాకముల్
నాకును నీకు నొక్కతరు
  ణమ్మున రాగకళాసార్ద్రితా
'లోకము లీ వియోగ దశ
  లో పరిఖేద విఘూర్ణితాకృతుల్'

అదియే యశోధరాహృదయము సమాధి స్థితినుండి బయట పడు సమయంబున-

'అలఘుతర ప్రశాంత హృద
  యాంతర సంతత సాహచర్యమం
ద లఘుతర ప్రశాంతి గని
  నట్టి యశోధర జీవితమ్ములో
లలిత వసంత సంధ్యలును,
  రమ్య శరత్తులు, సఖ్యసౌఖ్యరే
ఖలు స్మరణీయ మాత్రము లి
  కన్, పతిదూరకు కాంతియా ప్రభూ!'

'ఐహిక దుఃఖజీవిత మ
  హాబ్ధికరాళ విపత్పరంపరా
గాహిత చేతనోద్ధరణ
  కాంక్షయు, త్యాగవిలక్షితాత్మని
ర్మోహనిరీహనిశ్చల త
  పోనియమ ప్రణిబద్ధ బుద్ధియున్
నీ హృదయమ్మునన్ నెలకొ
  నెంగద! దీనదయామహోదధీ!'

అనుచు భౌతిక భోగలాలసనుండి ఆధ్యాత్మిక శాంత ప్రకృతి వైపు సాగినది. ఈ ఘట్టము కరుణ రసప్రధాన మగుటనో కరుణశ్రీ పడికట్టొకింత యీ కవివరు మీద కాన్పించుచున్నది.

'దీనను నేను; నా బ్రదుక
  దీనముగా నొనరించుకొన్న నీ
మానిని నేను, నీ మధుర
  మంగళమోహన రూపరేఖలో
లేని, స్మితమ్ములం బ్రతిఫ
  లింపని విశ్వవిలాసముల్ ప్రభూ
లేనివటంచు నమ్మితిని,
  స్త్రీని, వియోగభరన్, యశోధరన్!
'ఇదె నాజీర్ణ కుటీరవాటిక ప్రభూ!
  ఇందుం దపింతున్ సదా!
హృదయాగ్ని జ్వలనమ్ము పంచశిఖల
  య్యెన్! ధూమధూమ్రమ్ములై
చదలంటెన్, విరహాజ్య ధారలిటు వి
  స్తారమ్ములై - వేదనా
స్పద భావార్ద్ర గభీరగీతముల ను
  చ్చారించుకొందున్ ప్రభూ!'

ఇవ్విధంబున వివశత్వంబు నుండి బయట పడు యశోధర కొంత తడవు గతంబు స్మరించి భవిష్యత్తులో పతిదేవు పదంబు ఖచ్చితంబుగ నూహింపగనైను

'నీపదయాత్ర సర్వధర
  ణిన్ చలియింపగ జేయునో ప్రభూ!
నీపద చాంద్రిలో కరగి
  నీరగు సర్వజగద్వ్యథాశిలల్!
తాపము వాపి దైన్యమును
  ధన్య మొనర్చు ప్రసన్న వేళలో

నీపరయాత్ర నాకయి ధ్వ
  నించును దీర్ఘవియోగ మంతమై!'
'విచ్చిన ఆశనై అనుభ
  వించిన చేరువ యెల్ల దూరమై
వచ్చెడి నీ పదధ్వనుల
  వైఖరిలో ఫలితాశయమ్మనై
విచ్చిన కాంతినై, మమత
  వేరగుసౌరభ మింత చేరువై
అచ్చపు దాసినై నిలువ
  నా ప్రభు! నీదు సమాగమమ్మునన్ !'

'రాజగృహమ్ములో ప్రజలు
  రాజులు పాదసరోజరత్ననీ
రాజన మెత్తు బుద్ధయతి
  రాజును, నాహృదయాధినాథునిన్ !
యోజనసేయ నా మధుర
  యోగము దాసి వియోగ దృష్టి కి
ప్డే జరిగెన్ భవిష్య మగు
  పించు విచిత్ర రహస్యమను భూతియై!'

ఇట్లు భావించిన ఆమె ఆశాంతమే, ఆమె ఆత్మశక్తియే సిద్ధార్థుని సిద్ధార్థుఁ జేసె ననుటలో సందియములేదు

'ఓ విషాద ప్రపంచమా! ఓ అమాయిక ప్రజానీకమా! మీకు కలదు శాంతి,

తూర్పుదిశ ఎఱ్ఱబడును అహర్పతియును దోపనున్నాడు ! చీకటి తొలఁగగలదు ప్రపంచము చెడ నామెకు గలయును శాగ మిట్టిది సిద్ధార్థుడు తనపడంతి యెడంద నాశించిన విధంబు ఫలియించిన ట్లున్న యది కానిచో నామె

'సుఖ మిహజీవితాన నొక
  సుందరశోభ, నిజమ్మొ! దానికై
అఖిల జగజ్జనుల్ ప్రబల
  యత్నము చేయుటయున్ నిజమ్మొ! త
త్సుఖమును నాలియోగ మొక
  సాధనగా పరమాను భూతి వ
న్మఖత వహింప జేసి యెద
  పొంగె ప్రభూ! అమృత ప్రవంతిగా!'

అని యెట్లన గలదు?
  అట్టి యశోధర మందుగనే

'మారుత వీచికాగళము
  మంగళ ఘోష మొనర్చ, బుద్ధుడున్
కారుణికోత్తముం డమృత
  కంఠముఁన్ విమల ప్రబోధముల్
చేరువలో నొనర్చుచు చ
  రించినటుల్ నిజనిర్వికల్ప భ
ద్రోరు సమాధి నైక్య మిడ
  నున్నటు దోచె యశోధరాహృదిన్ '

అనుచు భవిష్యత్తును దర్శించుటలో వింత యేమి కలదు ? మహోన్నతంబులైన కార్యంబు లాచరించుట కంటె అట్టి భావములను కలిగియుండుట కష్టతరము భావమున్నచో అది యెట్లులైనను సాధింప బడక మానదు లోక కల్యాణమునకును, వినాశమునకును ప్రధానము సంకల్పమే అట్టి సంకల్పము మంచిదగుటవలన విపరీత పరిస్థితులందునైతము వైయక్తిక వినాశన మందు నైతము భావములను నిలుపుకొన గల్గుట ఉత్తమహృదయలక్షణము అట్టి హృదయంబులకు వంగవారి యశోధరా హృదయమును స్ఫూర్తిదము, అనుసరణీయము నిజమునకు బుద్ధదేవుని వెనుక ఒద్దికగా నిలచిన యశోధర హృదయంబును సందర్శించిన వంగల పార్థసారథి అయ్యంగార్ యశోధర లయ్యెద రనుట నిక్కము.

— —



## దుర్మతీ!

- శ్రీ డా. ఎస్. శ్రీధరరావు.

* కాల మనంతమై యెసఁగుఁ
  గాలమె దైవము, కాలరూపమున్
జాలము నిశ్చయింప నిఁకఁ
  జక్కఁగ నెట్లు విభజ్యమానమై
యొలిగఁ బెక్కువేళ్ళ కనె
  నో యొక మానవమాత్రు బుద్ధికిన్
దేలని గడ్డు ప్రశ్న, యిది
  తెల్పెడి కందదు నాకు దుర్మతీ!
* నీ కీ నామము నెవ్వ రిచ్చిరో కదా!
  నీ వెన్ని దుష్కృత్యముల్
వీఁకన్ జేసితో, యెన్ని కాఁపురములన్
  బీడించి బాధించితివో,
లోకాలన్ బరిమార్చితో కుటిల భ
  ల్లూక ప్రయత్నమ్ములన్,
లే కున్నన్ మన పూర్వు లీ విధముగా
  నిన్ బిల్తురా చెప్పుమా!
* నీకున్ స్వాగత మీయ నిల్చితిని ని
  ర్ణిద్రాత్మమర్యాదతో,
నీ కౌటిల్యము నుజ్జగింపుము మమున్
  దీవించి కాపాడుమా!
నీ కార్యాచరణంబులందున మమున్
  గ్రేఁగంట నీక్షించి, యా
ప్తాకం బెట్టక కాచికొమ్ము సుమతి
  ప్రాచుర్యశీలుండవై.
* పేరు కే ముంది యది నేతిబీఱకాయ,
మంచి పేరుండి చెడుగైన మనిసిఁ గనమె,
చెడ్డ పేరుండి జనముల శ్రేయమునకుఁ
బాటుపడువానిఁ గనమె సంబరముతోడ
* కోయిల కూసి కూసి తన
  గొంతుక వోవఁగ వృక్షశాఖపై
హాయిగ నున్న దయ్య!, మల
  యానిలుఁడున్ మధుమాస మొప్పులం
దీయఁగ వచ్చినాఁడు, విరు
  లెల్లెడఁ బూచెను నీదుపూజకున్
దోయిలి యొగ్గినాను, కృప
  తో మముఁ జూడఁగదయ్య దుర్మతీ!

—*—

ఆధునికాంధ్ర కవితా కల్పవల్లి

# 'అమృతవల్లి తెలుగుతల్లి'

— శ్రీ డా జి బి ఎస్ ఆచార్య ఎం.ఏ, పిహెచ్ డి

'మతం మరచి పోగలను
గతం విడచి రాగలను
భారతీయుడనునే నని
పరవశించి పోగలను'

అని సగర్వంగా చాటుకున్న దేశభక్త శిఖామణి, అభ్యుదయ కవిలోక గ్రామణి అయిన డా॥ దాశరథి-ఉత్తర అమెరికాలో నివసించే ఆంధ్రప్రజాళిని ఉత్తేజపరచటానికై తనపాత-కొత్త కవితలను సమ్మేళనపరచి 'అమృతవల్లి తెలుగుతల్లి' అనే కావ్యామృతగుళికను సృష్టించాడు. ఇది ఉత్తర అమెరికా తెలుగు సంఘం రెండవ సమ్మేళనంలో డెట్రాయిట్ నగరంలో 26 మే, 1979 నాడు ఆవిష్కరించబడింది. తనకు అత్యంత ఆత్మీయులు, అమృతహృదయులు, న్యూయార్కులో వైద్య విద్యాచార్యులుగా అఖండ సేవచేస్తున్న డా॥ కాకర్ల సుబ్బారావు దంపతులకు దాశరథి ఈ కావ్యాన్ని అంకితంచేసి ఉచితజ్ఞతను ప్రదర్శించాడు

'తెలుగువారి ఇల్లె తెలుగు దేశం బౌను
తెలుగువాణి అచట పలుకు చుండు
పంచదారకన్న పనస తొనల కన్న
తేనెకన్న మనదు తెలుగు మిన్న'

అని హర్షహృదయంతో వుప్పొంగిపోయాడు ఉత్సవం చేస్తున్న తెలుగు ప్రజలను దీవించటానికై తెలుగుతల్లిని ఆహ్వానించి, 'తెలుగులోనే పాడవలెను పాట' అనే తియ్యని సందేశాన్ని అందించాడు. ఈ కావ్యంలోని ప్రతి పాటా తెలుగు తేనెలవూట ఇంపులో సూటిగా అందించే సందేశాలతో పాటు, సూటి పోటీ మాటల ఈటెలు కూడా ప్రయోగించి తన ఆవేదనను వ్యక్తం చేసాడు

'ఆంగ్లభాష వ్రాతు వ్యాకృతి విడకుండ,
తెనుగుకేల వ్యాకరణ మటందు,
ఇంగిలీషు నుచ్చరించ నాగరికత,
మాతృభాషలోన మాట మోటు'

అంటూ మాతృభాషను గౌరవించే బుద్ధులు నేర్పాడు దాశరథి నేటి సమాజంలోని ప్రతి రంగాన్నీ నిశితంగా పరిశీలించి, అస్తవ్యస్తతకు ఎంతగానో ఆవేదన చెందటం కనిపిస్తుంది ఇందుకు-

'కాపికొట్టు మార్కుకల దని విద్యార్థి
జాగ్రఫీని తెచ్చె సైన్సు నాడు,
ప్రశ్నకేమి వ్రాయు ప్రత్యుత్తరమ్మును?
మార్క్సు ననుసరించె, మార్క్సు రాక!'

అనే విద్యావిషయికమైన కలుషితాన్ని!

'పడవ నడపలేని వాడు నావికుడు
పదము పాడ లేని వాడు గాయకుడు
అందుకనే వేదనతో నే నంటాను
ప్రజల నడపలేని వాడు నాయకుడు'

అనే రాజకీయపరమైన అసమర్థతను-నిరసించటం ఉదాహరణగా తీసుకోవచ్చు. ఇవి కేవలం ఉదాహరణలు మాత్రమే. ఇలాంటి ఆలాపనలు, ఆవేదనలు ఈ కావ్యంలో మనకు ఎన్నో కనిపిస్తాయి. వినిపిస్తాయి. ప్రస్తుతంమనం ఎంతటి దయనీయమైనస్థితిలో మగ్గిపోతున్నామో అని ఆక్రోశించి, పరిష్కారమార్గం ఏమిటా అని ఆలోచించి మనం ఆత్మపరిశీలన చేసుకుని బాగుపడాలనే తపనను పొందటానికి దాశరథి ఎంతో దోహదం చేసాడు.

'బండను కోయాలి కుసుమదళం
గుండెను కోయాలి నయన జలం.'

అనే సుకుమార హృదయుడు, కరుణామయుడు అయిన దాశరథి నూటికి నూరు పాళ్ళు ఆశావాది అసలు ఆశ ఆయన కవితకు పునాది అందుకనే-

'నిప్పులోంచి అప్పుడపుడు పొగ పుడుతుంది
నీళ్ళలోంచి విద్యుత్తు సెగ పుడుతుంది
ఈ దానవలోకంలో ఎన్నటికైనా
మానవు లని పిలువదగిన తెగ
పుడుతుంది.'

అనే ఆత్మవిశ్వాసాన్ని వెలిబుచ్చాడు. మానవజన్మ ఎత్తినందుకు మనం ఎలా నడవాలో, ఏంసాధించాలో తెలుసుకోవటం ఎంతైనా అవసరం. జీవితంలో ఒక్కొక్క ఏడాదీ గడుస్తుంటే ఆ ఏడాదిలో మన ప్రగతి ఏమిటో పరిశీలించుకోవాలి కాలం అమూల్యమైనది గతించిన క్షణాలు మళ్ళీరావు. ఈ సత్యాన్ని తెలుసుకోమని దేశికుడుగా దాశరథి ఎంతో మృదువుగా మందలింపుతో-

'జన్మోత్సవ సంరంభం చేస్తున్నారు
బంధువులూ మిత్రులు నవ్వేస్తున్నారు.
జీవితమున ఒక వర్షం గడిచిన వేళ
దుఃఖించాలన్నది మరచేస్తున్నారు'

అని హితబోధ చేసాడు. మనం అంతగా పట్టించుకోని సామాన్యమైన సన్నివేశంలో దాశరథి కవి చూపు ఎంతగా చొచ్చుకపోయి జీవనరహస్యాలను పసిగట్టిందో తెలుసుకుంటే ఆయన విశిష్టత స్పష్టమవుతుంది.

తూరుపులో కొత్తజాతి తొంగి తొంగి చూచినంతమాత్రాన, భరతజాతి జయపతాక ధరణికి వెలుగులరేక అయినంత మాత్రాన దాశరథి తృప్తిచెందలేదు క్షామ మంతరించాలి-సమృద్ధి సాధించాలి. అంటూ -

'నాదేశం ఆదేశం
నాకు మరపురాదు
తిండీ, గుడ్డా, ఇల్లూ
ఉండనివా డుండరాదు'

అనే ఉన్నతాశయాన్ని వెలిబుచ్చుతూ అప్పుడే నిజమైన స్వాతంత్ర్యం ప్రజ సంపాదించిన ట్లవుతుం దనీ, ప్రజా స్వామ్య పథం మీద, సామ్యవాదరథం మీద, స్వాతంత్ర్య కాహళని ప్రజావళి పలికించినదవుతుం దనీ తీర్పు నిచ్చాడు

శ్రీకరగీతాలు పాడి, జీవులను మేల్కొలిపే నవశకాది రాక కోసం ఎదురుచూస్తూ- దాశరథి తెలుగు మంటపానికి మధుతోరణాన్ని కట్టాడు

'పోతున్నది పాతయుగం - పోనీ పోనీ
వస్తున్నది కొత్తతరం - రానీ, రానీ
దిసమొలలై ఉన్న లతావిసరమ్ములకు
కుసుమాలే వసనావళి కానీ, కానీ'

అనే పరిణామ వాది దాశరథి - నిరంతరం సమాజాన్ని పరిశీలిస్తూ, - ప్రబోధగీతాలతో ప్రగతి ధర్మాలను వినిపిస్తూ, నిత్య విలసిత మాననీయ - మానవీయ కళా తేజస్విగా మనకు దర్శన మిస్తాడని; అంతే కాదు దాశరథి కవితా వాణి -

'వద్దన్నా, కద్దన్నా, ఎవ రేమన్నా
వినిపించును, కనిపించును మన కేకేట',

అని ఆశించటం సమంజసం !!

# ఊర్మిళ - సౌశీల్య సౌందర్యపు మిలమిల

- 'భారతీప్రియ' శ్రీ వెలుదండ సత్యనారాయణ.

స్త్రీల పాటలందు 'ఊర్మిళాదేవినిద్ర' బహుజనాదరణము పొందిన గేయము. ఇందూర్మిళాదేవి సౌశీల్యము స్త్రీజాతికే తలమానికముగా చిత్రించబడినది ఈ పాటయందలి కొన్ని విశేషములను తెల్పుటకు ప్రస్తుత వ్యాసోద్దేశము

సీతారాములు అరణ్యవాస సన్నద్ధులగుచుండ నూర్మిళ భర్తతో తానును వత్తునన్నది కాని లక్ష్మణు డామె యభిమతమును కొనసాగనీక వారించినాడు.

'నాడు మొదలుగ శయ్యపై నాతి పవళించున్నది' పదునాలుగేండ్లు కాలగర్భమున గడచి నీరయినవి సీతారామ లక్ష్మణు లయోధ్యకు తిరిగివచ్చిరి శ్రీరామచంద్రుడు పట్టాభిషిక్తుడైనాడు. సీతాదేవియే సౌమిత్రి విషయము భర్తకు జ్ఞప్తికి దెచ్చి

'ఇకనైన ఆన తిచ్చి తమ్ముణ్ణి ఇందుముఖి కడ కంపుడీ!' అని సిఫారసు చేసి సౌమిత్రి నూర్మిళ కడ కంపినది ఆతడామెను ముందుగానే మేల్కొలిపి తానెవరో తెలిపిన బాగుండెడిది కాని పాన్పుపై కూర్చుండి విరహమును వెడల బోయ నారంభించినాడు మూసిన కన్నులు పెద్దకాలము విప్పని యాపతి వ్రతకు ఆతి డెవరో పరపురుషు నట్లు తోప కలవరపడి'

'అయ్యో! మీ రెవ్వరయ్యా! మీరింత
యాగడమ్మున కొ స్త్రిరీ
వందు గోరదులు వెదుకుచు మీరింత
తప్పుసేయగ వస్త్రిరీ
ఎవ్వరూ లేనివేళా మీ రిపుడు
ఏకాంతమునకొ స్త్రిరీ
మా తండ్రి జనకరాజు వింటే మిము
ఆజ్ఞసేయక మానరూ
మా యక్క బావ విన్నా మీకపుడు
ప్రాణమున హానివచ్చూ.
మా యక్క మరిది విన్నా మిమ్మపుడు
బ్రదుకనివ్వరు జగతిలో-

'అంటుంది పరపురుష దర్శన వైముఖ్య మిందు సుస్పష్టగోచరము. 'ఆగడమ్మున కొ స్త్రిరీ' అన్నప్పుడు జరుగ కూడని దేదో జరుగ బోనున్నదైన సమయమందలి మానవసహజమైనయారాటము అందునా ఆడవారి కుండు 'దిగులు' 'బుగులు' 'భయము' చక్కగా అభివ్యక్తము అగుచున్నవి. తనకు కీడు తలప చేరినా డని యూహించినను ఆతనికి మాత్రము కీడు గాక మేలే జరుగు విధమున క్షేమమార్గము నే సూచించుచున్నది. అదియే కాదా 'అపకారికి నుపకారము నెప మెన్నక చేయు' మార్గము!

ఈమాటలు ఊర్మిళ ఉత్తమ సంస్కార పరిమళములను వెదజల్లు చున్నవి.

తన తండ్రిగాని అక్కబావలుగాని ధర్మహాని నెంత మాత్రము సహింపని దృఢదీక్షాసక్తులన్న సంగతి చివరి మూడు మాటలందే ఊర్మిళ నొక్కి చెప్పుచున్నది

'పేర్చైన వంశానికి అపకీర్తి
వచ్చె నేనేమి సేతూ
కీర్తిగల యింటబుట్టి అపకీర్తి
వచ్చె నేనేమి సేతూ'

మొదటి చరణంలో వంశ గౌరవాన్ని ప్రాణపదముగా కాపాడుకొను మెట్టినింటికి అపకీర్తి రాబోవుచున్నదని అందుకు తానే కారణముగా చరిత్రలో జనుల హృదయములలో నిలిచి పోవలసి వచ్చుచున్న దని' రెండవ పాదము నెంతో ఖ్యాతి వహించిన పుట్టినింటి

కూడ అదే సమయమున తన కారణముగానే అపఖ్యాతి కలుగబోవుచున్నదని ఊర్మిళ మనస్సులో నున్న అంతులేని విచారము వెలికి పొంగుచున్నది. ఇటువంటి ఆభిజాత్య సంపద గలిగిన ఆ సతి పరకాంతాగమనేచ్ఛను తిరుగా గర్హించుచు అతనికి హితవు చెప్పుచున్నది.

'ఒకడాలి కోరిగాదా ఇంద్రునికి
ఒడలెల్ల హీనమాయె
పరసతిని కోరిగాదా రావణుడు
మూలముతో హతమాయెను
ఒకడాలి కోరిగాదా కీచకుడు
ప్రాణములు కోలుపోయే
ఇట్టి ద్రోహములు మీరు ఎఱిగుండి
ఇంత ద్రోహము కోస్తిరా!
ఆడతోడున బుట్టరా మావంటి
తల్లిలేదా మీకునూ!'

పై పంక్తులందు కీచక ప్రస్తావన కనుగొన్న రామాయణ భారతముల పౌర్వాపర్యము లెరుగని జానపదు లెవరో ఈ గేయమును రచించి రనుకొనుట కవకాశము కలుగుట సముచితమే.

కాని పంక్తులందు మొదట అహల్యా ప్రస్తావన కలదు. అహల్యా వృత్తాంతము ఊర్మిళాదేవి నిద్ర నుపక్రమించకముందెంతో కాలము క్రిందటనో జరిగినది. కనుక భూతకాల విషయము. ఊర్మిళకు తెలిసే అవకాశము కూడా కలదు.

రెండవది సీతాపహరణ ప్రస్తావన, రావణవృత్తాంతము. ఇది యూర్మిళ నిద్రలో మునింగిన పిమ్మట జరిగినది. దీనిని వర్తమాన విషయముగా పరిగణించవచ్చు. ఇదెంత మాత్రము తెలిసే అవకాశమే లేదు. శ్రీరామచంద్రుని పట్టాభిషేక వేళగదా ఆమె మేల్కాంచుట. మేల్కాంచిన పిదప బయటి ప్రపంచముతో నేసంబంధము కలుగక మునుపే మొట్టమొదటనే లక్ష్మణునితో చేసిన సంభాషణము యొక్క సందర్భముననే మన మున్నాముకదా!

ఇక మూడవది కీచక ప్రస్తావన. ఎప్పుడో భవిష్యత్కాలమున జరుగనున్నది. ఇదియు నూర్మిళకు తెలియ వీలు లేదు. కాని ఆమె విరహయోగిని. భూత మట్టుకే వర్తమాన భవిష్యత్కాల వృత్తాంతములను ఆమె దృష్టికి సుగోచరములే యనుట సమంజసమే అగును.

అందులకే శ్రీరామరాజుగారు తమ 'జానపద గేయ సాహిత్యమున' నీ గేయము నందలి విశేషముల నుగ్గడించుచు నీ సందర్భమున ఊర్మిళ మాటలకు తమ మాటలు కొన్ని చేర్చి తెలుగు స్త్రీలు బలపరచి రనుకొనవలెను లేదా యోగులకు భూతభవిష్యద్వర్తమానాలు కరతలామలకములు గదా! విరహయోగిని యయిన ఆమె భవిష్యద్వర్తమానాలు జోడించె ననుకొనవలెయును' అని సమర్థించినారు. ఈమాట లెంతో యుక్తియుక్తములుగా సమయోచితములుగా నున్నవి. వినకు జానపదుల హృదయమది!

భూత భవిష్యద్వర్తమానాల గొడవలో కొట్టుకొని పోవుచున్న మనము మనకు తెలియకుండానే ఇట గల మరో విశేషమును జారవిడచుకొనుచు సాగిపోవుచున్నాము. ఒకక్షణ మాగి అదేమిటో చూచి మరల సాగిపోవుదము.

'పరసతిని కోరిగాదా రావణుడు మూలముతో హతమాయెను' అన్న రెండవ పాదమును పరికింపుడు.

'నా భర్తగాని బావగాని సామాన్యులని యెంచుచున్నావేమో! కాదుసుమా! వారు అవక్ర పరాక్రమవంతులు. అంతే కాక ముల్లోకములనే ముప్పతిప్పలు పెట్టినవాడు, సీతవంటి పరమసాధ్విని చెరనుంచినవాడు, లోకకంటకుడు అయిన రావణుని సమూలముగా నేలగూల్చిన ధర్మరక్షణ దీక్షాబద్ధకంకణులు జాగ్రత సుమా! పరసతులపై అత్యాచారముల తల పెట్టితివా రావణునికి పట్టిన గతియే పట్టును.' అనే హెచ్చరిక వ్యంగ్యముగా ధ్వనించుచున్నది.

చేయునదిలేక లక్ష్మణుడు తనను తా నెరిగించుకొన్నాడు. మధురసంభాషణ కొనసాగినది. అయినను ఆమె యింకా కనులు తెరువలేదు. సుఖభోగము లనుభవించు వయసంతా వ్యర్థపరచి తన నింత నిర్దయగా పెద్దకాలము వదలి పోయిన భర్తను కొంతసేపు ఉడికించా లనుకొని కన్నులట్లే మూసికొన్నది. అట్టి పరిస్థితిలో భర్తను దెప్పి పొడువవలె ననుకొనుట స్త్రీ సహజమే కదా! అయినను ఆమె అభీష్టము నెరవేరినది గాదు.

ఇట లక్ష్మణునికి భార్య యింకను కన్నులు దెరవ దేమి? తననింకను కనికరించదేమి? అన్న ఆరాటమే తప్ప తానామె కెంతవరకు న్యాయము చేకూర్చగలిగా నన్న ఆత్మ పరిశీలన పూర్తిగా మృగ్యమైన దను విషయము ప్రస్ఫుటమగుచున్నది అంతేకాక ఊర్మిళను భయపెట్టుటకు

'కత్తి ఒరదీసి యపుడూ లక్ష్మణుడు తా వేసికొందు ననెనూ; పాప మూర్మిళ యింకేమి చేయును; దిగ్గున లేచి భర్త పాదాలపై బడినది. ఇనప్పటికి -

'మా తండ్రి జనకరాజూ
మిము నమ్మి మరచి పెండ్లిచేసెనూ
చిత్తి మెంక దిక్కునుంచీ
సమయమున చిన్న బుత్తురుపురుషులూ'

అని చెప్పి పాడిచింది.

అప్పుడుగాని లక్ష్మణుడు తనపొరపాటేమిటో తెలుసుకొనలేదు. ఎంతయో పరితప్త హృదయుడై తాను కూడ ఆమెకై నిద్రాహారములు మానెనని చెప్పి మునుపే దంపతుల కడబాటు కలిగించితినో అని విచారించెను. భార్యహృదయ వేదన నెఱింగి ఎంతయో అనునయించెను. కౌసల్యాదు లోదార్చి యిరువురికీ తలంటి జలకము లాడించి భోజనము లిడిరి.

ఆ రేయి ఊర్మిళ శయ్యాగృహము సుసజ్జితమైనది. ఏకాంతమున నూర్మిళ హృదయము నందలి సోదరీ ప్రేమ స్వచ్ఛమై ప్రకాశించినది.

'సింహవిక్రములు మీరూ వుండగా
సీతెట్లు చెరబోయెనూ
రాజ్యాధిపతులు మీరూ వుండగా
రమణెట్లు చెరబోయెనూ'

సీత రాముని అనుమతినిప్పించి లక్ష్మణుని నూర్మిళకడ కంపుట గేయారంభముననే కనుగొంటిమి. అచట నామెకు ఊర్మిళ యెడగల సోదరీప్రేమ ప్రస్ఫుటమగును అదేరీతిగా ఈ సందర్భమునను నూర్మిళకు సీతాదేవియెడగల సోదరీప్రేమ సుస్పష్ట గోచర మగుచున్నది. తోడికోడళ్ళుండ వలసిన తీరిది కదా!

'అట్లుకాదు! భూత భవిష్యద్వర్తమానా లామెకు కరతలామలకములు కదా! మరల నెట్లడుగుచున్నదని ప్రశ్నింతురేమో! అపుడామె గడుసుదన మిందు ప్రతిబింబించుచున్న దని భావించ వచ్చును. తెలిపిన విషయమునే భర్త నోటి నుండి వినవలె నను కోరికతో మరల నడుగుట గడుసుదనముగాక మరేమి?

అప్పుడు లక్ష్మణుడు సీతాపహరణ గాథ వివరించెను.

ఈరీతిగా నూర్మిళ సౌశీల్య సౌందర్యపు మిలమిల. మహిళా లోకమునకే మణిపూస యనదగినట్లుగా చిత్రించబడుట వలననే ఈ గేయము, స్త్రీలపాటలలో నొక విశిష్టస్థానము నలంకరించ జాలినది.

# ❋ సురభి మాధవరాయలు ❋

– శ్రీ కాశీ రామచంద్రరావు.

సురభి మాధవరాయలు కవి పండిత పోషణ మొనరించుటయే గాక – తాను స్వయముగా చంద్రికా పరిణయ మను ఆశ్వాసముల కావ్యము రచించెను. శృంగారరసప్రధానమైన 'చంద్రికా పరిణయము' నే కథా వస్తువుగా తీసుకున్నాడు. సుచంద్రుడు చంద్రికను పరిణయమాడుట ఇందలి కథ ఆరోజులు శృంగారరస పిపాస గల వని – వేరే చెప్పనక్కరలేదు. ఈతడు సురభి వంశీయుడు. వీరిమూల . పురుషుడు బేతాళ నాయకుడు. మల్లక్ష్మా పోలుని పుత్రుడు. రేచర్లగోత్రుడు. వైష్ణవ మతాభిమాని. 16 వశతాబ్ది చివరనుండిన – అళియరామరాయల సమకాలికుడు. అతని వలన జటప్రోలు సంస్థానమును 1000 ఫసలలో బహుమానముగా గ్రహించి దానిని 1650 దాక పాలించినాడు. జన్మస్థలము మహబూబునగర్ – జిల్లాయందలి కొల్లాపురం తాలుకాలోని జటప్రోలు సంస్థానము.

మదనగోపాలస్వామి మాధవరాయలకు స్వప్నమున – సాక్షాత్కరించి

'వృత్తి మేమన్నఁ ద్రేతయం దేము దశర
థాత్మజత్వము గనియున్న నమితరక్తి
జాల మెప్పించె ధరణి సుచంద్రవృత్త-
మతని చరితంబు వివరింపు మనఘచరిత'

పుణ్యచరిత్రుడవైన మాధవరాయ! సుచంద్రుని చరితము వివరింపు మని కోరినాడు. ఈకవి బమ్మెరపోతన వలె తన కావ్యమును– నరాంకితము సేయనొల్లక మదనగోపాలస్వామికి కృతియొసగి ధన్యుడయ్యెను. ఇందు 901 పద్యగద్యములు కలవు. ఇందలి కథ రమ్యము. భావములు గంభీరములు. ఇందలికవిత్వము రసవంతములైన వర్ణనలతోడను, మధుర మంజులమైన పదప్రయోగములతోడను కూడి మనోహరముగానున్నది. వసంతమహాముని కథను చాల హృద్యముగా రచించియున్నాడు. అదే మన.

సుచంద్రుడు సఖునితో మృగయార్థమై హేమకూట పర్వతమునకేగెను. అట నించుక విశ్రాంతిఁ గైకొనదలచి యించుక – విశ్రమింప ఆసమయమున సమస్త మృగములను బెదరించుచు సింహము వారిపైకి వచ్చుచుండెను. అది చూచి రాజు తన– కత్తితో దాని శిరసును నరికెను. సింహమునకు వెంటనే పురుషాకృతి కలిగెను. ఆపురుషుడు రాజునకు నమస్కరించి తన కథను వివరించెను.

వసంతమహాముని పారిజాతారణ్యమునందు బ్రహ్మత్వమునకై తపస్సు చేయుచుండగ అతని తపస్సునకు భయపడి బ్రహ్మదేవుడు అప్సరోగణములలో చివరిదైన చిత్రరేఖను పిలిచి వసంతముని తపోభంగ మొనరించుమని పంపెను. ఆ మునియందామెకు కోరిక లేదు. లేదు సరికదా అతడు తపస్సుయొక్క క్లేశముచేత చర్మము బొమికలు మాత్రమే మిగిలిన శరీరము కలవాడు ముని అన్నచో జుగుప్స కూడ కలదు. ప్రభునాజ్ఞకాదనరాదు. ప్రేమకు రూపాతిశయమే ప్రధానముకాదు. చిత్ర

రేఖ ఆమునితో కొలది కాలము కామోప భోగముల ననుభవించెను. తనతపస్సును భగ్నముచేయుటానికి బ్రహ్మ చిత్రరేఖను పంపె నని తెలిసికొని ఓచిత్రరేఖా! నీదేవాంగనాత్వము తొలగి మనుష్యస్త్రీ వై పుట్టి మద్యపాయిని పెండ్లియాడు మని శపించెను. 'మునినాథా! నాతప్పును మన్నింపుము. నాదేవత్వము తొలగిపోయి నను భర్తాలేదు కాని మద్యపాయిని పెండ్లియాడి ఎట్లు సహింతు' నని చిత్రరేఖ కోరగ ముని ఆమెపై దయదలచి సుచంద్రుని పెండ్లియాడి లక్షసంవత్సరములు భూమియం దుండి ఆమీదట నిజస్వరూపమును పొందగల వనెను. ఆ మునిశాపము వలన చిత్రరేఖకు మర్త్యత్వము రాగానే - బ్రహ్మ చింతించి చంద్రికకు వీణా విద్యా రహస్యమును తెలుపుటకు నన్ను ఈ భూలోకమునకు పంపెను పాంచాలాధిపతి - క్షణదోదయుని కూతురగు చంద్రికకు తద్విద్యా రహస్యమున్ నేర్పితిని. నేను కుముదుడను కిన్నరుడను. బ్రహ్మదగ్గర ఉండెడివాడను. ఇక్కడ ఒకముని భార్యను చూచితిని అందుకు ఆముని తన భార్యను ప్రేమింపదలచి వచ్చితి నేమో అని భ్రమపడి అన్యాయముగ ఈపర్వతమందు సింహ శరీరముగలవాడవై జన్మింపు మని నన్ను శపించెను. సుచంద్రుని ఖడ్గమహిమవలన నిజస్వరూపము పొందగలవని చెప్పెను.

ఇదినావృత్తాంతము. చంద్రిక విశాలపురాధి పతియగు సుచంద్రుని హోమ కూట పర్వతమునందు చూచినది. పెదవి విప్పి పలుకరించలేదు. పొదరింటిలోని పూల గుత్తులవలె వారిగుణ పరిమళము కావ్యమంతటను గుప్పుమను చుండును. ఆమౌన భావములో వారు మాటలాడుచున్నట్లై-యుండును. చంద్రిక విరహాగ్నితప్తయై చెలు లెన్ని యుపచారములు చేసినను స్వస్థచిత్త కాలేదు. ఉపవనవిహారము, పుష్పాపచయము, జలక్రీడ బాధకములేయైనవి ఇందలి జలక్రీడాది వర్ణనలు సజీవములు మాధవరాయలు శబ్దసౌష్ఠవమునకు గాని, అర్థగాంభీర్యమునకు గాని, అలంకారఘటనకు గాని, కథా-కథననైపుణికిగాని తక్కిన పెద్దనరామరాజ భూషణాదు లకు దీసిపోవు వాడు కాడు

క్షణదోదయుడు స్వయంవరము చాటించెను. రాజకుటుంబములందు సాధారణముగ స్వయంవరములు జరుగుచు. వాని స్వరూప స్వభావములను కవి కన్నులకు గట్టినట్లు చెప్పెను. పార్వతీదేవి రాజులను వారి వారి గుణవిశేషములను ఉగ్గడించెను. చంద్రిక వరించుటకు రూపాతిశయము ఉన్నంత మాత్రమున చాలదు. ఒక్కొక్కచో శౌర్యాతిశయములను మూల్యముగా చెల్లింపవలసియుండును.

వివాహ వర్ణన సందర్భమున సుచంద్రుని యెదుట చంద్రకావి తెర పట్టియుంచుట, వధూవరులకు పురోహితుడు రక్షాబంధముకట్టుట. మాంగళ్య సూత్రబంధనములు, తలంబ్రాలు, లాజహోమము, వధువుచే సన్నెకలు త్రొక్కించుట, అరుంధతీ దర్శనము, మామయు బంధువులును వరునకు కట్నము లొసంగుట మున్నగు కార్యములన్నియు వివరముగ గా వర్ణించెను. పరిణయము, బంధు సమాగమము, ఎదురుసన్నాహము, పలుకరింపులు, చిలుకరింపులు, అచ్చముగా నేటి పెండ్లి నందనులను జ్ఞాపకము చేయును. చంద్రిక సుచంద్రుని వరింపగా తక్కిన స్వయం వరాగతరాజ పుత్రులు మత్సరగ్రస్తుల కాలేదు కారణ మేమి? స్వయంవర స్థ మున పార్వతీదేవి యున్నది ఆమెమహిమ వలన ఎట్టియనర్థములును జరుగుటకు వీల లేదు. ఇచట మాధవరాయల సంప్రదాయ జ్ఞత మనకు విశదమగును. ఇందలి పద్య ములు పెక్కులు వసుచరిత్రము నంద పద్యములను దలపించుచుండుటచే దీనికి 'పిల్లవసుచరిత్ర' అని పేరు కలిగినది. పద ప్రయోగపద్ధతి శైలి మొదలగునవి ఈతడ రామరాజభూషణుని రచన నే- మనమున నిడుకొని చేసెనా యని తలంచుట క కాశము కలుగుచున్నది.

# ఆత్మజ్ఞానము

- శ్రీ ఆర్. ఎస్. ఎస్. శర్మ.

* పోవును వైరము ప్రేమయు
చావున నశియించు జీవజాలం బెల్లన్
పోవనిదేదో పోయెడి
జీవులలో గాంచవలెను జిజ్ఞాసు లిలన్.

*కనరాని యక్షరంబును
మనమున నే విద్య నేర్చి మాన్యుడు కనినన్
చనరాని చోటు తెలియును
చనినన్ సుఖమెల్ల నుండు సన్నిధిలోనే.

(స దేవ నిధిః, సంశ్చాసౌ నిధిశ్చ, సమీపం)

*భువ నధ వేష్టిత భువనము
భవహారునకు భవ్యభాన భవనము భూపా!
కవియై భువి భవు గాంచిన
భవములు భవ మొంద వెపుడు భవ
ముండ గికన్.

— • —

# ఈ పక్షంలో

## సాహితీ వేదిక -

### ఏడవభాగము

'కృష్ణశాస్త్రి గారి కవిత్వంలో పదలాలిత్యం మాత్రమే కాకుండా భావలాలిత్యం గంభీరమైన తాత్విక చింతన ఉంటాయి. పైకి ప్రణయతత్వాన్ని బోధించినట్లుగా ఉన్నప్పటికీ తరచిచూస్తే తత్వాన్ని గురించి విపులంగా ఉంటుంది' అని సాహితీవేదిక ఏడవ సమావేశంగా జరిగిన 'కృష్ణశాస్త్రి శర్మిష్ఠపై సమాలోచన' ను సమీక్షకులుగా వ్యవహరిస్తూ శ్రీ గాదేపల్లి వక్కలంకేశ్వరరావు అన్నారు.

రెండురోజులపాటు గౌతమీ గ్రంథాలయంలో జరిగిన ఈ సమాలోచన కార్యక్రమాలలో మొదటిరోజు అంటే 1వ తేదీ సాయంత్రం 'పల్లకీ' కావ్యంపై పలువురు సభ్యులు ప్రసంగవ్యాసాలు వినిపించారు. ఆరోజు సమీక్షకులుగా శ్రీ గురజాల హనుమంతరావు వ్యవహరిస్తూ కృష్ణశాస్త్రి కవిత్వాన్ని ఆస్వాదించడానికి రసమయ చిత్తవృత్తి ప్రధానం. మన అలంకార శాస్త్రాల్లో చెప్పిన పద్ధతుల్లో చదివితే కవిత్వంలో ఆనందం తెలుస్తుంది. అన్నారు.

ఆరోజు శ్రీ కె. గోపీచంద్ 'ఓహో వసంతా!' ఖండికపై చేసిన ప్రసంగ వ్యాసంలో కృష్ణశాస్త్రి పదాల ఎంపిక నుంచే ఎంతో తెలుసుకోవచ్చనీ ఆ ఖండికలో కోయిల స్వాగతం చాలా గొప్పగా ఉందని అన్నారు

శ్రీ కల్లూరి భాస్కర్ కావ్యం మొత్తం పరిశీలిస్తూ 'అందం, ఆనందం' అనే భావాన్ని పూర్ణంగా నేటి కాలం అంగీకరించదు. సామాజిక బాధ్యత కృష్ణశాస్త్రిపై లేదనీ సంప్రదాయపరంగా రాసిన వాళ్ళల్లో ఎన్నదగిన కవులలో ఆఖరుకవి శ్రీకృష్ణశాస్త్రి అనీ అన్నారు ఈ సందర్భంలో 'సామాజిక బాధ్యత-కవి' అన్న విషయం మీద చర్చ జరిగినది.

శ్రీమతి వై సావిత్రి 'కృష్ణశాస్త్రి తెలుగు మొగసాల నిలిచిన మందారంగా (తనలోని) తెలుగు విద్యార్థినికి అవుపిస్తున్నారనీ అయితే హేతువాదదృష్టిలో చూస్తే కృష్ణశాస్త్రి పెద్ద బూర్జువాగా కనిపిస్తారనీ తమ ప్రసంగ వ్యాసంలో రెండు రకాల దృక్పథాన్ని విడిగా వినిపించారు.

శ్రీ దిగవల్లి శివరామకుమార్ అనుకోని అతిథి ఖండికను అలంకారసూత్రంద్వారా నిర్వచిస్తూ తమ ప్రసంగ వ్యాసం చదివారు.

శ్రీగుంథం నాగసుబ్రహ్మణ్యం శ్రీకృష్ణశాస్త్రికి మనిషిపై ఉన్న ప్రేమ, ప్రస్తుత స్థితిలో మనిషికి కలగగల ప్రమాదం గురించి ఆయనభయం, ఈ ఖండికలో తెలుస్తున్నాయి. స్వార్థంతో నిండిపోయిన మనిషికంటే మృగం నయమని ఈ ఖండికలో చెప్పారు' అని 'అయో! మానిషి' అనే ఖండిక మీది ప్రసంగ వ్యాసంలో పేర్కొన్నారు.

శ్రీ సి. వి. యస్. మహేశ్వర్ 'మాట మౌనం' ఖండికపైని వినిపించిన ప్రసంగ వ్యాసంలో ఈ ఖండికలో స్త్రీ పురుషుల మధ్య సంబంధాన్ని మౌనంమాట అనుబంధంగా వర్ణించడంలో శ్రీకృష్ణశాస్త్రి వాడిన ఉపమానాలు చాలా సరిపోయేట్లుగా ఉన్నాయని అన్నారు.

రెండవరోజు శర్మిష్ఠ కావ్యసమాలోచన జరిగింది. శ్రీ గాదేపల్లి వక్కలంకేశ్వరరావు సమీక్షించారు. శర్మిష్ఠ కావ్యం రేడియో కావ్య నాటికల సమూహం కనుక చదవడంద్వారా దాన్ని పూర్తిగా ఆస్వాదించలేమని ఆయన అన్నారు.

శ్రీ గురజాల హనుమంతరావు శర్మిష్ఠ నాటకంపై ప్రసంగిస్తూ 'ప్రణయతత్వాన్ని శ్రీ కృష్ణశాస్త్రి ఈ నాటికలో చక్కగా వివరించారనీ అయితే వైరాగ్యతత్వం ప్రణయతత్వం ముందు నిలబడలేకపోవడం చిత్రించబడిందనీ అన్నారు.

శ్రీ గురజాల హనుమంతరావు 'ఏడాది పొడుగునా' నాటికలో స్త్రీ పాత్రల సంభావన సహజంగా ఉందని అన్నారు. తెలుగు నుడికారాన్ని ప్రతిభావంతంగా ఉపయోగించారని అన్నారు.

శ్రీ సి వి. యస్. మహేష్ యమునా విహారం' నాటికలో స్నేహతత్వం చక్కగా చిత్రీకరించబడినదనీ, వేణువు పిలుపు ఒక చిహ్నమే అనీ అస్నేహంలో అవధులు లేవనీ అన్నారు.

శ్రీ శర్మిష్ఠ నాటికలో పదాల కూర్పు వసుచరిత్రను స్ఫురణకు తెస్తోందనీ,వసంత హేమంతాలను ఈ నాటికలో దేవయానీ శర్మిష్ఠా పాత్రలలో వ్యక్తీకరించారనీ అన్నారు.

అంతకుముందు 'నిరుడు కురిసిన హిమ సమూహములు' ఖండికను కృష్ణశాస్త్రి 'పుష్పలావికలు' వచనము వినిపించారు. ఈ కాలంలో సంస్కారం మారినా కవితాగుణం ఎప్పుడూ ఒకటే అనీ, సృజనాత్మకతను బంధిస్తే అది పెరగదనీ అన్నారు.

రెండురోజుల సమావేశములను శ్రీ మల్లాప్రగడ రామారావు నిర్వహించారు. శరత్ బుక్ హౌస్ వారి సౌజన్యంతో సాహిత్య గ్రంథాలను తక్కువధరకు అమ్మడం జరిగింది. మార్చి 21,22 తేదీలలో గౌతమీ గ్రంథాలయంలో సాయంత్రం గం 6॥ లనుంచి గం 9॥ వరకూ ఈ కార్యక్రమాలు జరిగాయి. తరువాత సమావేశం ఏప్రియలు 5వ తేదీ ఉగాది నాడు జరుగుతుందనీ అందులో ఇష్టకవితాపఠనం ఉంటుందనీ, ఎక్కడ జరిగేది తరువాత తెలియచేయబడుతుందనీ రామారావు ప్రకటించారు. — సి.వి.ఎస్

— • • • —

## 'మయూరి కళాసమితి' ప్రారంభోత్సవం

15-381 తేదీ సాయంకాలం గం 6½ లకు రాజమండ్రి శ్రీ వేంకటేశ్వర ఆనం కళాకేంద్రంలో 'మయూరి కళాసమితి' ప్రారంభోత్సవం జరగింది.

సభకు శ్రీమధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారు అధ్యక్షత వహించిరి శ్రీ బుగ్గాపాపయ్య శాస్త్రిగారు సభా ప్రారంభముగావించినారు ఉభయులూ కళాపోషణ ఔచిత్యమును, ఆవశ్యకతను తెలిపి సమితి అభివృద్ధిని ఆకాంక్షించిరి

సమితి కార్యనిర్వాహకవర్గ అధ్యక్షు లెవరో కార్యదర్శి ఎవరో ఇతర సభ్యు లెవరో - ఇత్యాది వివరములుస్పష్టపరుప బడలేదు సమితివారి ప్రప్రథమకార్యక్రమంగా కుమారి వీణామూర్తి నృత్య ప్రదర్శనమును ఏర్పాటు చేసిరి

నృత్యారంభము పరమేశ్వరారాధనతో రమణీయము గా జరపబడినది వీణామూర్తి ప్రసిద్ధ నాట్య విద్వాంసులు శ్రీ కోరాడ నరసింహారావుగారి శిష్యురాలు ప్రసిద్ధ శాస్త్రీయ కూచిపూడి నృత్యారంభమున అ శాస్త్రీయ-మంగళప్రదము కాని-పద్ధతిలో సహనావవతు ఇత్యాది ఉపనిషన్మంత్ర పఠనము తదనుసారి అభినయము ఏలకో తెలియకున్నది తన్మంత్రోచ్చారణము స్వరదోష భూయిష్ఠమై యున్నపుడు అది యెట్టి ఫలితమును చేకూర్చునో చెప్పగలవారు కనబడరు దాని విలువ తెలియనపుడు ప్రతి - చిన్న పెద్ద - కార్యారంభమునందును దానిపై మోజుపడ నేలకో తెలియదు నేటిసభా సంప్రదాయ - అవలక్షణములలో - అది యొకటిగా పెక్కుచోట్ల గానవచ్చుచున్నది కళా విషయములో సంప్రదాయ బద్ధతపై మిక్కిలి గౌరవము గల శ్రీ నరసింహారావుగారు ఇట్టి అనౌచిత్యమును పరిహరించుటకు పూనుకొన గలరని ఆసించుట పేరాసబుగాదు

(చూ 3వ కాలము చివర)

## సంస్మృతి

- శ్రీ ధూళిపాళ అర్కసోమయాజి.

[విమర్శక గాండీవి, బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి జయంతి సందర్భంగా సమర్పించు అక్షరప్రసూనాభిషేకలహరి)

*తెనుగుం భారతి నాదు జిహ్వపయి న
  ర్తింపగ భావోన్నతిన్
మనముప్పొంగగఁ, దెగ్గువాడల లస
  న్మానోజ్ఞకశ్రీల పా
వనసారస్యముఁ బంచిపెట్టిన భవ
  త్ప్రజ్ఞావిశేషమ్ములన్
జనముల్ మెచ్చగఁ బద్యసూనములఁ బ్ర
  స్తావింతు రెడ్డీ! కవీ!

*వరమునఁ గట్టమంచికుల
  వర్ధనతన్ వరరెడ్డివంశమున్
సురభిళయుక్తకావ్యసుమ
  శోభలనింపగ భావశక్తిచేన్
నిరుపమ ఖండకావ్య మవ
  నిన్ 'ముసలమ్మమృతిన్' రచింపఁగాఁ
బరవశమంది యశ్రువులుఁ
  బారగ మెచ్చిరి పాఠకోత్తముల్

*ఏనుగు లెక్కకున్నను క
  వీశ్వరపీఠిని రెడ్డిరాజువై
వీనుల విందుఁ జేసెడు క
  విత్వము లల్లుచు నాంధ్రవిశ్వ వి
ద్యానిలయమ్మునందుఁ ధ్రువ
  తారగ నిల్చి యశోవిరాజస
మ్మానిత మూర్తివైతివి సు
  మా! భరతావని రామలింగమా!

*బ్రహ్మణ్యుండవు కాకపోయినను నా
  భాషావధూటీకృపన్
బ్రహ్మత్వ ప్రతిభావిభాసితవచః
  ప్రాజ్ఞప్రభావోన్నతిన్
బ్రాహ్మీరూపముఁదాల్చి పావన యశో
  భామాకరస్పర్శచే
బ్రహ్మాండమ్ములరించి నావు కవన
  వ్యాపార విస్ఫూర్తిచేన్

*నిండు మనంబుతోడ కమ
  నీయముఁ గావ్య విమర్శలందు ను
ద్దండ కవిత్వ తత్త్వపు సు
  ధామధుధారల నందఁజేసి యీ
పండితపుండరీకముల
  పాలిట భాస్కరబింబమై ధరా
మండలిఁ గీర్తిచంద్రికల
  మాన్యుఁడవైతివి రామలింగమా!

*పుష్కలమైన కావ్యగుణ
  ముల్ గణుతించుచు దోషయుక్తమా
శుష్కపుఁ గైతలేరు పరి
  శోధన లందున జాణయౌచు మ
స్తిష్కప్రయోగశాల పని
  చేయఁగ వాఙ్మయ వార్ధియందునన్
దుష్కవితాస్రవంతులను
  దూయగఁ బట్టితి వయ్య! సత్కవీ!

*భువిని విమర్శకోత్తములఁ
  బుట్టిరిగిట్టిరి నీవలెన్ సదా
ప్రవిమలకావ్యశిల్పములు
  వన్నెలు చిన్నెలుఁ బట్టిచూపుచున్
నవయుగ వాఙ్మయమ్మునను
  నవ్యవిమర్శల మార్గదర్శులై
కవులుగఁ గీర్తిగాంచి త్రిజ
  గన్నుతులై తగువార లుండిరే?
భౌతికాకృతి నీభువిఁ బరగకున్న
సాహితీ రూపమున రవిచంద్ర తార
లున్నపర్యంతమునునీదునున్నతుల్, ప్ర
దీప్తితో వెల్గునయ! మణి దీప మట్లు

— —

---

వేలు వేలుభంగిమములలో సుమా[illegible]
2 గం॥ల సేపు జరగిన కుమారి వీణామూ[illegible]
నృత్యప్రదర్శనము పలువుర కానందవ[illegible]
గల్గించినది లోగడ ఉన్న బిరుదమే[illegible]
గాక 'నాట్యమయూరి' అను బిరు
మామెకు ఈ సభలో ఇచ్చి సన
నించిరి

— • —

# రిజర్వేషన్లు

స్వాతంత్ర్యం వచ్చినతర్వాత మన భారత రాజ్యాంగ నిర్మాతలు అనేక శతాబ్దాలుగా సాంఘిక ఆర్థికాది రంగాలలో వెనుకబడిఉన్న వారి అభ్యున్నతి కోసం విద్యారంగంలోను ఉద్యోగరంగంలోను ప్రజాప్రతినిధుల ఎన్నికల రంగంలోను పదిసంవత్సరాలపాటు రిజర్వేషన్లు ఉండాలని నిర్ణయించి రాజ్యాంగ బద్ధం చేశారు రాజ్యాంగ నిర్మాణపరిషత్తు నాయక ప్రముఖులలో నిమ్నజాతి ప్రముఖనాయకుడు కీ శే అంబేద్కరు ఒకరనేమాట మనం మరచిపోకూడదు

మూడు పదులవరకు ఆ రిజర్వేషన్లు పొడిగింపబడినా ఏ వెనుకబడిన (నిమ్న) జాతుల అభివృద్ధికాముకులయిన నాయకులకూ తృప్తికరంగా వారి అభివృద్ధి జరగలేదనేది ఆయా నాయకుల మాటలవలన వ్యక్తమగుచున్నది ఇది రిజర్వేషను విధానములోని లోపమా? గడువునిర్ణయించిన అంబేద్కరు వంటి మహానాయకుల మేధాలోపమా?

ఇతర జాతులతో అన్ని రంగాలలోను సమస్థాయికి వచ్చేవరకు నిమ్నజాతులకు రిజర్వేషనులు ఉండవలసిందేననీ, వెనుకబడినతనం ప్రాతిపదికగా కాక కులం ప్రాతిపదికగానే అవి ఉండాలనీ షెడ్యూల్డు కులాలవారు తిరుగుబాటు చేయవలసిందనీ శ్రీ జగ్‌జీవన్‌రామ్‌వంటి వారి ప్రకటనలు సూచిస్తున్నవి

గుజరాతులో ఆరంభమై, రాజస్థాన్ వగైరా ప్రాంతాలకు విస్తరిస్తున్న రిజర్వేషను వ్యతిరేకోద్యమాన్ని నిర్దాక్షిణ్యంగా అణచివేయవలసినదిగా కేంద్ర, రాష్ట్ర, ప్రభుత్వ ముఖ్యనాయకులుగాని, ప్రతిపక్ష నాయకులుగాని అనటం లేదు ప్రతిభకు అన్యాయంజరగకుండా చూడాలనీ రిజర్వేషను వ్యతిరేకోద్యమ విద్యార్థి నాయకులతో పరిష్కారానికి కృషి చేయాలనీ ఇంచుమించు అందరూ అంటున్నారు వ్యతిరేకోద్యమంలో కూడా కొంత సామంజస్యం ఉందని దీనివల్లనే తేలుచున్నది

తొట్టతొలిసారిగా విభజించిపాలించే సిద్ధాంతం ప్రాతిపదికగా బ్రిటిషు ప్రభుత్వం సృష్టించినది యీ రిజర్వేషను విధానం అపుడు నిజమైన జాతీయ నాయకులందరూ దానిని ప్రతిఘటించారు ఇపుడు వోట్లరాజకీయాలుదృష్టిలో పెట్టుకొని ప్రభుత్వ పక్షాలూ ప్రతిపక్షాలూ రాజ్యాంగ భక్తీ, నిమ్నజాత్యభిమానమూ ఏకగ్రీవంగా పోటీపడి ప్రదర్శిస్తున్నారు

ప్రతిభకి న్యాయం చేకూర్చడం, రిజర్వేషన్లూ సమన్వయభిన్నాలన్నది నిర్వివాదాంశం ప్రస్తుత నిమ్నజాతుల దుస్థితికి ఎపుడు ఎవరు ఏవిధంగా కారకులన్నది చారిత్రక నిర్ణీతమైన విషయం కాదు ఎపుడో పూర్వతరముల వారు చేశారని ఊహింపబడే అన్యాయానికి ఇపుడు వారి సంతతిప్రతిభావంతులను శిక్షిస్తా మనడం తర్కసహం కాదు ఏ విధంగాను తనకంటె ప్రతిభలో ఎక్కువకానివాడు తక్కువైనవాడు తన కళ్ళయెదుట విద్యాలయాల సీట్లలోను, ఉద్యోగాలలోను, ప్రమోషనులలోను, తన్ను వెనుకకు నెట్టి ముందుకు పోవడం అన్నది ప్రతిభావంతునకు భరింపరానంత వేదనాకరం కాకమానదు

నిజమైన నిమ్నజాత్యభిమానులు వారు ప్రతిభ పెంచుకొనేందుకు కావలసిన ఆర్థికాది సహాయము లెన్నైన చేయదగును కాని ప్రతిభారాహిత్యానికి బహుమానం ఈయడం భావ్యం కాదు ప్రతిభారహితులకు రిజర్వేషనుల ద్వారా సదుపాయములు పెంచుకూ పోతే మూడుశతాబ్దులకు కాదుకదా ఎంతకాలానికీ మిగిలినవారితో సమస్థాయికి రావడం కష్టం

ప్రతిభావంతులు నిరుత్సాహపరచబడి ప్రతిభ కోలుపోయి ప్రతిభలో నిమ్నజాతుల స్థాయికిరావడంద్వారా సమసమాజ స్థాపన ఎవరికీ అభిలషణీయం కాజాలదు

— సంపా

## ANDHRA KESARI SCIENCE CLUB

### Rajahmundry

Nivedita Kishore Vihar High School team led by Shri S Jagannadha Raju has won the Sivannarain Bang Memorial Rolling Shield in the Annual Quiz Programme for the academic year 1980-'81.

Bala Vignana Mandir High School, A team led by Mr Vinay Martin won the second place Bala Vignana Mandir High School, B Team led by Mr B S Venkateswarlu won the third prize For this academic year only three monthly Quiz Programmes were conducted in the months of January, February and March From next academic year it will be conducted on the last Sundays of every month from August 1981 to February 1982 The individual prizes for members of winning teams are donated by Godavari Friends Association, Rajahmundry The Prize distribution function is tentatively fixed on the evening of 10 th May 1981

( తరువాయి 16వ పేజీలో)

శతజయంతి ఉత్సవ సందర్భ వ్యాసము

# కట్టమంచివారి కవితావిపంచి

- 'కవిమిత్ర' శ్రీ వసంతరావు రామకృష్ణారావు ఎం ఏ

సుప్రసిద్ధ సాహిత్య వేత్తగా, రాజనీతిజ్ఞుడుగా, మనీషిగా మేధావిగా పేరు గడించుకొన్న శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి సారస్వతసేవ సంస్మరణీయమైనది. డా॥ బెజవాడ గోపాలరెడ్డి గారు చెప్పినట్లు 'ఆంధ్రవిశ్వవిద్యాలయం వారు రచించిన బృహత్కావ్యం' వారు సాధించి, సంపాదించి, అందించిన ఆంధ్రవిశ్వకళా పరిషత్తు ఆంధ్రజాతికే గర్వకారణం -
శ్రీ రెడ్డిగారి పేరు స్మరణకి వచ్చిన వెంటనే విజ్ఞానసుధలను పంచిపెట్టే, విశిష్టమైన విద్యాసంస్థ అయిన విశ్వకళా పరిషత్తు, ఒక మహోవ్యవస్థగా మన కనులముందు సాక్షాత్కరిస్తుంది. మొట్టమొదటి విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులుగా, విశ్వకళా పరిషత్తుయొక్క వికాసానికీ, దాని ఉన్నతికీ ఆయన చేసిన సేవ నిరుపమానం. అంతేకాక ఒక గొప్పవిద్యావేత్తగాను, సాహితీ పరుడుగాను కట్టమంచి వారికి మంచిపేరు ప్రఖ్యాతులున్నాయి.

వాస్తవానికి, పాశ్చాత్య విద్యావిధానంలో అధ్యయనం చేసిన రెడ్డిగారు 'పడమటిగాలి' ప్రభావానికి లోను కాకుండ, స్వజాతీయమైనభావాలను పెంపొందించుకోవడంతో పాటు, ఆంధ్ర భాషాభిమానంతో, అజరామరమైన కావ్యం రచించడం వారి మేధాశక్తికి, ఆంధ్ర భాషాసంపత్తికి నిదర్శనాలు - ఒకవిధంగా చూస్తే ప్రాచ్యపాశ్చాత్య సాహిత్య విధానాలను ఆయన సమన్వయం చేసికొని, సాహితీస్రష్టగా, ఉత్తమ విమర్శకుడుగా పేరు గడించుకొన్నారు

ఆంధ్రభాషాభిమానం ఆయన సొత్తు. తనవంశానికి తెలుగుభాష అక్షయంగా ఉండిపోతే అదే పదివేలు అనుకొనిన మహనీయుడాయన! రెడ్డిగారు ఆధునిక కవులలో పేర్కొనదగినవారు. ఇరువదేండ్లు నిండకపూర్వమే వారు రచించిన 'ముసలమ్మ మరణము' ఒక చక్కని నవ్యభావకవితావిలసితమైన పద్యకావ్యము. ఈ పద్యకావ్యానికి [illegible] స్వర్ణ [illegible]లను చెందిన ఆంధ్రభాషాభిరంజని సభవారు ఉత్తమ బహుమతిని ప్రకటించారు.

ఆధునిక తెలుగుపద్య కావ్యములలో విశిష్టతగల ఈ 'ముసలమ్మ మరణము' చిన్న కావ్యము. దీనిని రచించుటలో రెడ్డిగారు నవ్యతను చూపేరు. సంప్రదాయము ప్రకారము, కావ్యం మంగళాంతముగా ఉండాలి. ఈనియమం ఒక శాసనంలాగు పాటింపబడే ఆరోజులలో రెడ్డిగారు, విషాదాంతంగా ఉన్న ఒక చక్కని సాంఘిక ఇతివృత్తాన్ని తీసికొని, కావ్యం రచించడం ఒక విశేషం. దృశ్యకావ్యరచనలో, విషాదాంత విషయాన్ని తొలిసారిగా ధర్మవరం రామకృష్ణమాచార్యులుగారు గ్రహించారు. అయితే విషాదాంతమయిన ఇతివృత్తాన్ని ప్రవేశపెట్టి (శ్రవ్య) కావ్యరచన చేసినవారిలో రెడ్డిగారు మొదటివారు! ఈవిధమైన రచనకు వారే మార్గదర్శకులు!

కరుణరసపూర్ణంగా ఉండే ఈ పద్యకావ్యంద్వారా ముసలమ్మ పేరుగల సుదతి బలియైనట్లయితే, చెరువు గట్టు తెగి, మునిగిపోవడానికి సిద్ధంగా ఉన్న గ్రామమూ అందలి ప్రజలూ రక్షింపబడతారని ఆకాశవాణి పలికింది. అందుకై, ముసలమ్మ అందరి కోసం ఆత్మత్యాగం చేసి ఆగ్రామవాసులను ఆపదనుండి కాపాడింది. ఇది సంఘ శ్రేయస్సును ఆశించి, ఆత్మార్పణ చేసికొన్న ఒక పూత చరిత్ర. చరిత చక్కని కథనంతోనూ, స్వాభావికమైన వర్ణనలతోనూ, రమ్యమైన వర్ణచిత్రములతోనూ, కూడిన ఈ చిన్న కావ్యం గుణసంపత్తి చేత విశిష్టతను గడించుకొన్నది. సాంఘిక కావ్యమును లోకకల్యాణప్రదంగా రచించి రెడ్డిగారు కీర్తిగడించుకొన్నారు. ముఖ్యంగా గ్రామీణ స్త్రీ యొక్క సౌభాగ్య సౌందర్య సంపదను, సౌకుమార్యంతోనూ సౌశీల్యంతోనూ వర్ణించడంలో రెడ్డిగారు కృతార్థులయినారు. అదేవిధంగా నిసర్గమనోహరంగా ఉండే గ్రామజీవన విధానాన్నికూడా వీరు చాల ప్రశంసాపాత్రంగా వర్ణించి, ఆధునిక కావ్య రచయితలకు ఆదర్శప్రాయులయ్యారు

రెడ్డిగారు ఆంధ్రాంగ్లభాషలలో మంచి గ్రంథాలు వ్రాసారు 'కవిత్వతత్త్వ విచారము' లో విమర్శ ఏవిధంగా ఉండాలో నిరూపించారు 'వ్యాసమంజరి పంచమి' వంటి వీరి గ్రంథాలు నేటి కళాశాలా విద్యార్థులకు పాఠ్య గ్రంథాలుగా నిర్ణయిస్తే, దానివలన విద్యార్థిలోకానికి ఎంతయినా మేలు జరుగుతుంది. శతజయంతి ఉత్సవ సందర్భంగా వారిరచనలను మరింతమంది చదివి ప్రయోజనం పొందేట్లు చూస్తే బాగుంటుంది అదియే వారికి మనం ఇచ్చే నిజమైన సత్కారం అని నాభావము

— —

( 15 వ పేజీ తరువాయి )

the day of NCERT-NTS Examinations The Programmes were conducted by Sarva Shri Ch Hanumantha Rao, Convenor M S N Murthy and J Kameswara Rao

C V S Maheswar
Director

— —

Regd. No. H/Rmy-42. Samalochana 1, Aprial 1981

# సమాలోచన సంపుటములు

వివిధ సాహిత్యాది విషయాలకు చెందిన 241 రచనలతో కూడిన సమాలోచన తృతీయ సంపుటము 24 సంచికలు ఒకే వాల్యూముగా హాఫ్ క్యాలికో బైండు చేయబడి అమ్మకమునకు సిద్ధముగా నున్నది.

వెల రు. 20 లు. ఎం. ఒ. ద్వారా పంపినవారికి పోష్టుఖర్చులు మేమే భరించి రిజిష్టర్డు పోష్టులో పంపగలము. వి. పి. పద్ధతి లేదు.

మొదటి, రెండవ సంపుటముల వాల్యూములు పూర్తిగా అయిపోయినవి.

— సంపాదకుడు.

అడ్రసు :—

సంపాదకుడు, బులుసు సీతారామశాస్త్రి,
రిటైర్డు తెలుగు లెక్చరరు, వి. టి. జె. కాలేజి,
6-8-7, ఇన్నిసుపేట (త్యాగరాజనగర్), రాజమండ్రి-1.

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.